హా రా వ ళి.

# క ల ము.

---

కలమా ! నింపుము సొంపుమై; విశదమై
కాంత్యుజ్జ్వలంబై, సుధో
పలసంకాశవికాసమై, మహితమా
పత్రాళిమీఁదన్ మషీ
సలిలాంచనస్మృదువర్ణమాలికల నీ
సామర్థ్య మింపొందఁ; గే
వలనీలోత్పలహాలికావళులఁ దే
వన్ దావు లేపారఁగన్.

క. వాఙ్మయము నిర్మలభావవి
ధేయమ్ముగ బుధజనాతి • ధేయముగ, జగ
ద్గేయమ్ముగ, లలితసుధా
పాయమ్ముగఁ బాఠక శ్రీ • వణపేయముగన్.

చ. హృదయమువెంటనే పరువు
లెత్తుము మేల్ రతనాలకోవ నీ
కొదవినయట్టులే; నిలుచు
చుండక మేనితళ త్తళదుగ్రిచుల్

పొదలంగఁ జేయు టే పనిగఁ

బోఁపు మనంబులన త్త్రటిల్లతా

భ్యుదయముఁ గాంచిచు ల్లైఖిబు

ఘోత్సవదాయిని ! దివ్యలేఖినీ !

మ. అమితఖ్యాతి సహింపఁగోరితలక్రిం

దైశంత నేమాయె ? నీ

క్రమమెవ్వారలకబ్బనే ! సుకవిచం

ద్రపాద్రిఘహృద్భాసితా

ర్థములస్వర్థము జేసి కూర్చెదవుగా

దాయుస్థితిన్ లేఖినీ

స్థమసంభూతసుప్రనీలమణిశ్రే

నామ్రలికా ! తూలికా !

గీ. తళతళత్కాంతి పత్త్రిసం ♦ తతుల నొలయఁ

గలకలధ్వని గతిభేద ♦ ములఁ జెలంగ

భవ్యతరమైనయక్షర ♦ పథమునందుఁ

బూల, ముత్యాల జల్లుచుఁ ♦ బొమ్ము కలమ !

గీ. తిరుగు మరుగుఁ జేసి ♦ దీనుని ప్రభుఁ జేయఁ

దిప్పితిప్పి ప్రభుని ♦ దీనుఁ జేయ

నెవనిహృదయమరుగు ♦ నేరీతి నారీతి

మెలఁగుశక్తి నీకె ♦ కలదు కలమ !

క. శ్రీమంతుల చేతులలో
సామంతముఁజూపుద్రవ్య ♦ సంతతిపోల్కిన్
ధీమంతుల చేతులలో
సామంతముఁజూపి మెలగఁ ♦ జాలెద వీవున్.

గీ. నిలిచి తనపని సతము రా ♦ ణింపకున్న
వన్నెకెక్కఁడుగాదె నే ♦ ర్పరితనంబు
జగతి విధిసృష్టియెల్లను ♦ క్షరమెగాని
కలమ! నీసృష్టియెల్ల న ♦ క్షరముసుమ్ము!

చ. స్థలముసుధానురూపము; ప్రశస్తపథంబుశుభాక్షరంబు; తా
వలము సుధీహృదంతరవి భాసిత సాధుమహాశయంబు; ని
స్తులము ప్రభావ; మేగతిని జూచిననీకుఁ గొఱంత లేదు త్రి
ప్పులఁ బడుచుంటివంచుఁదల పోయకుకష్టమెకాఫలంబిడున్!

గీ. అంబునిధిలోననుప్పుగ లైనఁగాని
జలకణము శుక్తి ముత్యమై ♦ యలరునట్లె
యజ్ఞుకడ గుడ్డిగవ్వకా ♦ యయును గాని
నీవు కవిచెంత ముత్యాల ♦ కోవవగుదు.

చ. అరమరలేక నీవు విమ
లాధ్వమ్మునం జనుచుండు వేళ నో
ప్పరయఁగ లేక దుష్టమతు
లడ్డము వచ్చిన నీవిలాసభా
సురవిమలాక్షరాకృతులఁ
జూపుచునాఁపుము; వారలంతకున్
గరకుగ నున్నఁదీవ్రపద
ఘట్టన నెట్టనశాస్తి సేయుమీ !

చ. కవులను పేరివక్రపథ
గాములచేఁ బదుటబ్బెనేని నీ
ప్రవిమలకీర్తులెక్కడివి ?
బండతనంబె శరణ్య; మచ్చటన్
దవు నది; మేలిబుద్ధి గల
దానవయే నటఁ గొయ్యవారికుం
టువదుము; పల్లటీలెగిరి
టొంకు; మదేయుపకారమయ్యెడిన్.



# ఆంధ్రభారతి.

---

సీ. విబుధులాంధ్రిక ♦ వితతియంబును చెట్టఁ
బట్టిపారంబును ♦ ముట్టినపుడు
నావెన్కఁబోతరా ♦ జాదులచే నుప
లాలింపఁబడుచు మే ♦ ల్గాంచినపుడు
నయ్యనంతరమున ♦ నలసాని పెద్దనా
దులప్రాపకంబున ♦ నలరినపుడు
నామీఁద సూరక ♦ వ్యాదులచేఁ దగు
పద్ధతిఁబోషింపఁ ♦ బడినయపుడు
నెంతవైభవందితో? ♦ యిప్పుడిట్టి
కాలమాసన్నమైన నే ♦ గతియు లేక
యెవ్వరెటు లాగినను నటు ♦ లేగుచుండి
నసిచెడి యుంటి తే! యాంధ్రభా ♦ షావధూ

సీ. గణయతిప్రాసల ♦ ఘనము లేమిటి
యూ" కుంటువడిపోవు ♦ ననెఁ
గణముండఁదగు; "నైసు" ♦ గానుండు
క్కనవి "యూస్లెస్"నని ♦ కేరలువరు

వ్యాకరణంబేల? ♦ వలదు "మైందున" కెక్క
నట్లువ్రాయవలయు ♦ ననెడివారు
కాదొక్కకవిప్రయో ♦ గింబున్నఁ జాలు "న
పై" చేయనగునని ♦ పలుకువారు
నగుమహానుభావులు కవు ♦ లైరి; నీకుఁ
బ్రాణములు మీఁదికిని వచ్చె; ♦ నచ్చటచట
విబుధులున్నార లమృతంబు ♦ వేయఁగలరొ!
యుఱకచూచుచు నుండెద ♦ రో? తెలుంగ!

సీ. పాండురోగము కల ♦ వానిదేహమువోలెఁ
బైపూఁత మెఱుఁగుల ♦ పద్యములును
నబలుని యగ్గంబు ♦ లటు నీరసములై
పసివాళ్లు సెందెడి ♦ వచనములును
సరవి నున్మత్తప్ర ♦ సంగంబులం బోలి
కడు నసందర్భదు ♦ ష్కల్పనలును
కల్లుఁద్రావినవాని ♦ కాఱుకూతలవోలె
బడబడలాడెడు ♦ పాడుపదము
లిన్ని యన్ని యనుచు లెక్క ♦ యిడఁగరాక
వెలయుచుండె నీనాఁడు; వి ♦ వేకమును స్వ
భావము ననుమాటయె లేదు ♦ పదకవులకు
నకట! యిటమీఁద నెటులౌనొ ♦ యాంధ్రభాష.

సీ. కేవలశ్లేషయే, ♦ కావలయుంగావ్య
మాధురికనుబుద్ధి ♦ మానుదాఁక
ఘననారికేళపా ♦ కమున గ్రంథము వ్రాయు
కవిప్రౌఢుఁడనువాఁడు ♦ కడచుదాఁక
దీర్ఘసమాసముల్ ♦ తెగివ్రాయకుండినఁ
దేలిక యనువెఱ్ఱి ♦ తీఱుదాఁక
నొకశబ్ద మగుపల్కు ♦ లుండుపద్యంబులే
హృద్యంబులనునాఁడు ♦ లేగుదాఁక
తలఁచినప్పుడె యెన్నొప ♦ ద్యములువ్రాయఁ
దగుననుకవుల్ జనించుట ♦ తగ్గుదాఁక
ఎంతతపియించినను నీకు ♦ నెప్పటివలె
వెలయుభాగ్యంబు గలుగదో ♦ తెలుఁగుబాస!

సీ. పరగఁదత్సమతద్భ ♦ వవ్యాజమున సంస్కృ
తంబుఁగైకొని వేడ్కఁ ♦ దనరలేదె!
దేశభాషలఁ గొన్ని ♦ దేశ్యపదంబుల
స్నేహమునఁ జేకొని ♦ నెగడలేదె!
తత్తద్విశేషసం ♦ దర్భంబులందన్య
భాషాపదములలోఁ ♦ బఱుపలేదె!
నిక్కంబుగాఁ జూడ ♦ నీవొక కొన్నిభా
షలలోననుండియే ♦ కలుగలేదె!

కొత్తయో యన్యభాషలోఁ ♦ గొనుట నీకు?
మంచియో చెడ్డయో నాదు ♦ మాట వినుము
మంచిభాషల నీవొక్క ♦ మార్చుకొనుచు
నిలుపుకొనుమమ్మ! నిను నీవె ♦ తెలుఁగుబాస!

సీ. దేశభాషాభివృ ♦ ద్ధికిఁ బాటుపడుచు స
మాజంబులను గూర్చు ♦ మహితులార!
మదిఁదన్పుగతిమృదు ♦ మధురరీతులఁబ్రబం
ధములువ్రాయుకవిమూ ♦ ర్ధన్యులార!
గురువిమర్శనమున ♦ గుణదోషములు నిర్ణ
యింపఁజాలెడు విబు ♦ ధేంద్రులార!
శ్రద్ధాళురై యని ♦ శంబు సద్గ్రంథముల్
చదివి యానందించు ♦ సరసులార!
పండితుఁడు మొదల్ బాలుని ♦ వఱకుఁ జదువఁ
దెలియగలయట్టిగ్రంథముల్ ♦ వెలయుదాఁక
నవి స్వభావాన్వితంబులై ♦ యలరుదాఁక
నాంధ్రభాషాసమభివృద్ధి ♦ యగుట కల్ల.

గీ. కవులకిట్లువ్రాయఁగ బుద్ధి ♦ కలుగుఁగాక!
దీనినే పండితులు సమ ♦ ర్థింతురుగాక!
దినమునకు నొక్కవింతగాఁ ♦ దెలుఁగుబాస
దేవదేవునికరుణ వ ♦ ర్ధిల్లుఁగాక!

చ. ౫౯౫

# గృహలక్ష్మి.

క. రతనంబు చేత మేల్మిగయొ
రతనము మేలిమినొ జగతి • రాణించుటయున్
బతిచేత సతియొ సతి చేఁ
బతియో వెలయుటయు, నెఱుఁగఁ • బడ దెవ్వరికిన్.

ఉ. ఏమొక వాక్యమిందు వచి
యించెద మొప్పిదమంటయే బుధ
గ్రామణులైన వారినుడి.
కారము; సమ్మదసంభ్రమావలో
కామిత కౌతుకాభ్యుదయ
మా గృహిణీరమణీయదర్శనం
బే మహనీయు చిత్తమెల
యించునొ వాని దెభాగ్యమన్నఁగన్.

గీ. అవనిలోఁ గల్గుపూజ్యవ • స్తువులలోనఁ
జెలువ తానొక్కఁడయి ప్రకా • శించు ననినఁ
గాంత గేహమ్ము నకు నలంకారమనెడి
మేటికవివాక్యరత్న మేమిటికిఁ జాలు?

చ. నరులపురోభివృద్ధికిస
నాతనకారణశక్తియైవిభా
స్వరవరగేహరాజ్యవిభ
వంబునకాదిమసన్నిధానమై
పరగెడుమానినీవిమల
పావనచిత్రచరిత్రమేకవీ
శ్వరుఁడురచించితృప్తిఁ
గనఁజాలునొానిక్కమతెల్పుఁడెల్లరున్.

సీ. తనయమైతనతల్లి ♦ దండ్రులమదిముద్దు
పలుకులనాటపా ♦ టలనుదనిపి
కాంతయైప్రాణేశు ♦ కనుసన్నలమెలంగి
యనుకూలవర్తని ♦ యైచెలంగి
కోడలైగుణముల ♦ కుప్పయోాయనఁగఁదా
నత్తమామలకెదు ♦ రాడకుండి
అత్తయైకోడండ్ర ♦ ననుఁగుఁదసూజుల
నయ్యైవిధంబుల ♦ నాదరించి

గీ. అఖిలరూపంబులనుదాన ♦ యగుటకతన
నఖిలరూపంబులకునుదా ♦ నాథ్యయగుచు
లలితసంసారసామ్రాజ్య ♦ లక్ష్మియనఁగ
నిహపరసుఖంబులిదువది ♦ యింతికాదె?

లనందియల్ గదలఁ
గానెదురై దరహాసయుక్తమై
కలకలలాడు నెమ్మొగముఁ
గన్పడఁ జేసెడు నప్పుడెంతగాఁ
గలఁగెడు మానసంబయినఁ
గౌతుక మందఁగఁ జేయుచుండునా
చెలువల గేహలక్ష్ములని
చెప్పుటచాలునొ చాలదో కదా!

గీ. వనిత గృహరాజ్యలక్ష్మియే • వాస్తవముగఁ
గానిచోఁ దత్కటాక్షను • శ్రీనియుక్తి
కలరి సామ్రాజ్యధారేయుఁ • డైనఁగాని
పూరుషోత్తముఁ డెదఁగూర్పఁ • బూను టేల?

ఉ. పంటయుఁ బాడియున్ బలము
పారక శాఖిభవంబు భాగ్యమున్
దంటతనంబు పౌరుషముఁ
దాల్చినయేనొక యింటివారుగా
నుంటకు మంగళాంగులున
యోన్నత పూతచరిత్రలైన వా
ల్గంటుల సాహచర్యములె
కావలయుం గద పూరుషాళికిన్.

గీ. పురుషునకునర్ధదేహమై ♦ శరణమునకి
శరణ్యమైఘనసంసార ♦ తరణమగుచు
సకలసౌభాగ్యములకు సం ♦ స్థానమైన
వనిత లేకున్న భవనము ♦ వనముగాదె ?

గీ. అలరుమొగమునఁనిల్లాలు ♦ తలుపుచాటుఁ
గాఁగనిలుచుండి వెన్నెలఁ ♦ గాయునొక్కొ
చిఱునగవుగాని తేనియ ♦ చిందునొక్కొ
నెఱపలుకుగాని నెఱపిరం ♦ జించువిభుని.

ఉ. మేలిమి పైఁడి ప్రాఁత పస
మించు బవంతులనంగణంబులన్
నీలమణీవితర్దికల
నిర్మలభత్త్యపవిత్రశాలలన్
వేలుపుటిండ్లలోననొక
వింతహొయల్ చెలఁగంగఁగూర్మియి
ల్లాలు మెలంగుచుండినగృ
హంబెగృహాంబుధరాతలంబునన్.

క. జిలిబిలిపలుకులముద్దులఁ
జిలుకుకుమారునొడిలోనఁ ♦ జేరిచికొనిజో
లలువాడినిద్రవుచ్చెడు
జలజేక్షణకలుగునిల్లు ♦ స్వర్గంబుగదా !

౫. జగతి రెండింటిచేత నే ♦ జరగుచుండు
ధనముచేతను సత్కళా ♦ ధనముచేతఁ
దలఁపన విరెండు కాంతాధి ♦ ద్వైతము తె
సారమతులిది నిజమని ♦ తీరపలయు.



# కపోతము.

---

క. శ్రీమంతంబై విభవో
ద్దామంబై పుణ్యలోక • ధామం బగుని
త్యామోద స్థానముహ
స్తామలకం బగును సుకృతు • లగువారలకున్.

---

క. కంటఁ దడి యేల పెట్టెదు?
వింటికి మొగమెత్త వేమి • వెత చేకూరెన్
దంట నెడఁబాసియేమిటి
కొంటిగ లేపూవిగొమ్మ • నుంటి? కపోతీ.

క. జలజలఁ గన్నుల నశ్రులఁ
జిలుకుచు మెడఁగుంచి క్రుంగి • చెలువమెడసి యీ
యెలగొమ్మ నొంటికాలున
నిలిచి తపించెద విదేటి నెగులె? కపోతీ.

క. మెత్తని రెక్కలు, జిగిదళు
కొత్తెడునును మేను, మెఱయు • చుండెడినెమ్మో

మిత్త్రుఁ గేటికి వాఁడెవో?
చిత్త మెఱియఁదోడఁగనాకుఁ ♦ జెప్పుమ కపోతీ.

క. నిలిచి నిలిచి గురగురమని
పలికెద వీ తేఱుఁగు ప్రియుని ♦ పజ్జవసింపం
గలనాఁటిదానివలెనే
దలఁత వోడముచుండె మనము ♦ వందఁ గపోతీ.

క. ఎగురఁగఁజూచెదవంత నె
యెగురఁగలే వెంతో దప్పి ♦ నెలసితి వేమో !
వగరుచు గతిఁ దోఁచెడు మొగ
మొగుపక నోరిట్టి తెఱచె ♦ దేమొ? కపోతీ.

క. ముకుఁ జొనిపి ఱెక్క లార్పవు;
చకచక నోడలట్టు నిట్టు ♦ సవరింపవు; వా
లిక మూపుఁ జూచి కులుకవు;
మొక మింతయి కుందనేమి ♦ మూఁడెఁ? గపోతీ!

క. నిలిచిన నిలువక
కలఁత వోడముదానివోలెఁ ♦ గడువడి నేలా
సెలగొమ్మమాటునకుఁ జని
వులుకుపులుకుమనుచుఁ జూచి ♦ పొక్కెదె? చెప్పుమా!

క. ముకుపుటముల నాహారము
నొక దొక రందించుకొనుచు ♦ నుండెదునిను నీ

సఖునిఁ గనుచుందు నెప్పుడు
సకటా! నేఁ డెచటి కేగె • నాతఁడు? చెడుమా!

క. పగఁగుఱ్ఱింగి సొగసుగ్గివ
మొగిడిచి తోనె కనుపిచ్చి • మూర్ఛిల్లెదు నీ
మగఁడు కలలోనవిన్నం
దిగవిడిచినయట్లు తోఁచె • నే? చెప్పుఁగా!

క. వలిగాలి చివురుపవస
లోలయింపఁగఁ బ్రియునిఁ గూడి • యుండెదునీ కే
యలజడి యేటికిఁ గల్గెనో?
పలుకుము నాతోడ; జాలిఁ • బడ లేనింకన్

క. రిక్కించి దెసలఁ జూచెద
విక్కడ నిను డించి మేఁత • కేగినవిభుఁడే
చిక్కులఁ బడియెనో యనువగఁ
జిక్క; నినుంగాంచఁ గడుపు • చెరు వగుచుండెన్.

క. నోరెఱుఁగనిపక్షికి నీ
కారాటముఁ దూర్ప నక్క • టా! నీదుమనో
హారు వలఁ బట్టి యాతనిఁ
గ్రూరుఁ డొకఁడు బుట్టఁ బెట్టి • కొని పోఁడుగదా

క. అదిగో! చిక్కనినెత్తురు
కుదులఁగ నెలగొమ్మగుఱ్ఱిచ్చ • కొనియున్నది యా

పదునగు బాణము; నీప్రియు
నెదుఱొమ్మున నాఁటి దూసి • మేగిన దేమో!

క. ఇది నిజమే యయ్యయో!
పొదలెడు నీమగని హృదయము • పుటభేదనమై
పరిదరాఖ్యసార్థకంబుగఁ
బరనై యమదూతభంగి • భయ మిడుచుండెన్.

క. పతులుఁ వగఁ బొగుల సతులన్
సతులు వగం బొగులఁ బతులఁ • జంపుదు రకటా!
మతిహీనులు మృగయులు దు
ర్గతు లున్నవటన్న భయము • గలదో? లేదో?

క. కలకలఁ గూయుచు ముద్దులు
గులుకు కపోతములఁ బెంచి • కొందురుగా కి
ట్లలుగుల పాల్సేయుదురే?
యలరుం గుసపాన గుఱిత్తు • రటర? కిరాతా!

క. కటికితనంబున కే ము
చ్చటపడి యెద వెట్టిపావ • జాతివోపారిఁబుల్
కటకటఁబడ నేసెదవ
క్కటా! బిడ్డలఁ గన్నకడుపు • గాదే మృగయా!

క. జీవన విహావనసీమల
నీవారము మనుపు; మనుపు • నీ వనుభావం

బాపహిలఁ గూయుపక్షుల
నే వేఁటాడెడు కిరాతుఁ • డెంత యదయుఁడో?

క. అలుగా! యని వెనుదీయని
బలియురపైఁ జూపు నీడు • వాఁడితనంబీ
పులుగునును మేన నటవే!
మెలయునె దయ బోయ నాశ్రి • యుంచిననీకున్!

క. మీయుసురు లపహరించిన
బోయఁడు సుఖ మొక్కపూట • పొందునొ లేదో!
మీయుసురుదాఁకి యాంతని
వేయుగతులఁ గలపకుండ • విడదు కపోతీ!

క. అలు గలుకుడైనచోటన్
బులుఁగు నిలుపదందురో క • పోతి! యిదేలే
చెలువునెడ బాటు నెమ్మదిఁ
గలఁగింపఁ దెగించి చావఁ • గాఁ దలఁపవుగా?

క. మెడ వ్రేలవైచి, వడవడ
వడఁకుచుఁ, గన్నుగవఁ దేల • వైచి, పదంబుల్
తడఁబడ ఆక్కొర్చి, భువిం
ఇడమోమై పడితి వసురు • విడలేదుగదా!

క. అయ్యో! యింక నేమున్నది?
కొయ్యావడె నేమ్రను గుండె • కొట్టుకొనదు నీ

రమ్యో నొడలు శ్వాసము రా
దయ్యె నసురు విడిచి పోయె ♦ నా? యకటకటా!

క. పతికిని సతియే సతికిం
బతియే గతి యని తలంచు ♦ పక్షివిగాసన్
బతి యీలోకము విడువఁగ
నతని ననుసరింప నిట్టు ♦ లైతే? కపోతీ.

క. జగమంధకారమయమై
వగపు సముద్రమయి బ్రిదుకు ♦ భారంబై తోఁ
వఁగ మగనిఁ గోలుపోయిన
వగఁ గూలిననిన్నుఁ జూడ ♦ వగ వయ్యెడినే!

క. వలపులఁ గూరిమి నెరపెడు
తలఁపుల నొండొరుల కుంచు ♦ దంపతులకు దు
ర్బలవిధిచేత వియోగము
గలిగిన సేకరణి నోర్వఁ ♦ గావచ్చుఁ? గటా!

క. చెలువల సుఖదుఃఖములకు
చెలువములకుఁ బ్రియములకు ♦ జీవమ్ములకున్
చెలువులకలుములె యూఁత
మ్ములని మెఱింగికొని చేరఁ♦బోయితె? ప్రియునిన్.

క. చనిపోపు మగని విడి, న
చ్చిన వేఱొక మగనిఁ గోరి ♦ చేరెడు పత్నుల్

నినుఁ బోటివారు గారే
కనుఁగొన నది నీకుఁ దప్పు ♦ గాఁ గనఁబడెనే?

క. ఓ వెఱ్ఱిపుల్గ! యేటికిఁ
జావవలయునమ్మ! నీదు ♦ సంతతి బ్రదుకం
గా వెరవు గలదె? విధవ యు
జీవించి సతీవ్రతంబుఁ ♦ జెల్లింపరటే!

క. చెలువల రెండవ పెండ్లికి
బలవంతము చేయుదురటె! ♦ వలదనుచుండం
గులజులు; దూరాలోచన
వలదే? చాకున్ననీవు ♦ భావము చెడునే?

క. కులకాంతల నినుఁబోలం
గలవారలు కోటి కొక్కరు ♦ గలరో లేదో?
కులశీలవ్రతనియమం
బులు నీకే చెల్లెనమ్మ ♦ పులుగుపడంతీ!

క. మనమిచ్చినతని కేమి
చ్చిననైన ఋణంబుఁదీర్పఁ ♦ జెల్లదని కదా
చనవిచ్చినమగనికినై
తను విచ్చితి వెంతసుగుణ ♦ ధన్యవో పతగీ.

క. నిన్నెఱుఁగుదు నీతిన్నని
తెన్నెఱుఁగుదు వంగడంబు ♦ తెరఁగెఱుఁగుదు నో

పున్నెపుఁబులుగ ! మాప్రేమను
కొన్నను గొల మూటగట్టు ♦ కొనుటయె గాదే!
క. అరుగుము దివ్యపతంగీ !
యరుగు! మరుగు! మమలమైన ♦ దానందదమై
తిరమై తేజోమయమై
పరగుపదంబునకు విభుని ♦ పరిసరమునకున్.
క. అందఱు సదయహృదయులే
యందఱు సమభావయుతులె ♦ యందఱ అమృతులే
యందఱుఁ దృష్ణారహితులె
యం దెందును మృగయు లుండ ♦ రరుగు కపోతీ!

---

# పంజరకీరము.

క. అలరుంబోఁడుల మొత్తని
యలరింగేల్దోయిఁ బెంచుగఁ ♦ సంతతిపుణ్యం
బలవడియోఁగాన నిన్నా
యలరువిలుతువాహనంబ ♦ నందురు చిలుకా!

క. రతనపుఁబంజరమున సం
తతమును వసియించి పంచ ♦ దారయుఁ బండున్
హితమతి భుజియించెడు స
ద్గతి నీవేగాక యెవరు ♦ గాంచిరి? చిలుకా!

క. అంతిపురంబునఁ గలసీ
మంతినులెల్లరును నీదు ♦ మాటలువినసుం
కింతురు సంతసమునఁ బ
ల్కింతురు మోదమున నాల ♦ కింతురు చిలుకా!

క. మన్నించుదొరలునీకుం
గన్నాకై పోషించుచుండఁ ♦ గా నెన్నఁటికిన్
నిన్నుఁ బరులెవ్వరైనం
గన్నెత్తియొకింత చూడఁ ♦ గలరే చిలుకా!

క. సకలఫలంబులునీమ
న్కికిఁ జేర్చుటకాకపల్క ♦ నేరిపె నీప

లోకైకవేయువరాలుగ నె
న్నికొనెద నేమిటఁ గొఱంత ♦ నీకో చిలుకా!

క. గాటపుఁ గూరిమినీకుం
బాటలుఁ బద్యములు నేర్పి ♦ వలసినచోటన్
మాటకుమాటకు లంచము
పూటకుఁ బూటకు నొసంగి ♦ పోషితురు చిలుకా!

క. అరమరలు లేక నీవుం
గొరవంకయు నొకరికొకరు ♦ కోడిగమాడం
దొఱసును మఱిమీముద్దుల
గఱగఱికలు మెచ్చవచ్చుఁ ♦ గాదే చిలుకా!

క. కొదువుపడకుండ నీకె
వ్వైదివలయునో దానిఁ గూర్చు ♦ నేలికలుండన్
సదనమున నుండునీకు
న్నది లేదను చింతవలయు ♦ నా? రాచిలుకా!

క. ఫలములచేఁ దనుయాత్రిం
జలుపఁగలవు సంతతైక ♦ సనాత్రగ్గరతిన్
మెలఁగెదవు, రామనామముఁ
బలికెదవట, మింకకంటె ♦ భాగ్యముగలదే!

క. చిలుకా! నీపంజరమును
వెలలకుమీ మొఱసుగందు ♦ పిల్లులుకడువి

చ్చలవిడిఁ దిగుచున్నవి
బలవంతముగాఁగనొడిసి ♦ పట్టునొ? యేమో!

క. కవకవఁ గూయుచుఁ జదలన్
జివచివఁ జను నడపిజాలి ♦ చిలుకలపలుకుల్
చెవియిచ్చి యేలవినియెద
వవమతి నెగురంగ జెక్క ♦ లార్చెద వేలా?

క. తెగియించిగుంపుగుంపుగ
గగనంబునఁ దిరుగుచిల్క ♦ గమిఁగనియుప్పొం
గఁగఁబోకు మట్టిమార్గము
తగదుసుమీ నీకునిది య ♦ థార్థము చిలుకా!

క. ఆయొడిసెలవేరిటులున్నా
రాయిడులా చెట్టు చెట్టు ♦ రాకలుపోకల్
నీయెదఁదలఁపవె? యేగతిఁ
బోయిబ్రిదుకఁ గలవు భ్రాంతిఁ ♦ బొందకు చిలుకా

క. బంగరుగజ్జెలుకాళ్లనె
సంగఫలాహారములుల ♦ సన్నీరములున్,
జెంగటనుండఁగ నవహా
రాత్ర్యంగణములనుండు టెవరి ♦ కబ్బునెచిలుకా!

క. కికురించిపోయినంతనె
ముకుగాటులు గోళ్లమొనల ♦ పోటులెకానీ

*యేకట! నిను బ్రిదుక నిత్తురే?
మొక మెఱుఁగని చోట బ్రిదుకు ♦ పొందులు గలవే.

క. ఒక్కరు పెట్టిన ఫలములఁ
జక్కఁగ మెక్కితివి చిన్న ♦ తనమాదిగ నీ
వెక్కడ? కానన వాటిక
లెక్కడ? నిలువంగ నేర్తు ♦ వేత్రుటినైనన్?

క. మనిచెడివారలనే న
మ్మనినైజము గలుగువక్రి ♦ మతివగు నీమే
లునకె నినుఁ బంజరంబున
నునుపవలసె ననుచు నెఱిఁగి ♦ యుండుము చిలుకా!

క. మదివెనుక ముందు నరయక
మొదిదోఁచిన నదియె చేయు ♦ దెఱుఁగవు లాభం
బిదియని నష్టం బిదియని;
వదలి చనిన మీఁదఁ గీడు ♦ వచ్చును జిలుకా!

క. అవివేకము నైజము నీ
కెవరేఁ దెలుపక యె తెలియు ♦ నెఱుఁగవు స్వేచ్ఛం
దవిలి చరియింపఁగా నే
రవు వెడలఁగఁ బోకు పంజ ♦ రంబును జిలుకా!

క. సరివరువారు మిన్నం
దిరి నేనీపంజరమునఁ ♦ దిరుగవలసెనం

చోరలకుమునీకున దికి
సరిపడదిటఁగలదు నీకు ♦ సౌఖ్యముచిలుకా!

క. ఎగురఁగ లేపించుకయును
డగకును నాఁకటికిన్నింత ♦ తాళప్రగడియుం
పఁగలేపు మేఁతనిటనిను
దిగవిడిచిన నెట్లుగా బ్ర ♦ దికెదవు? చిలుకా!

క. దూరాలోచన సేయఁగ
నేరక యడిచూసనెదిరి ♦ నిన్నెఱుఁగకయే
వారిని పిరిచిఁ గనుఁగొని
కోరకునీతలకుఁ దగని ♦ కోరిక చిలుకా!

క. చిలుకా! యీపంజరమున
నిలిచిన నినుఁబ్రియసఖిగ గ ♦ ణింతురునీప
ల్కుల నాదరింతురంతటఁ
గలిసితిరుగు చిలుకకట్టి ♦ గౌరవమున్నే?

క. పొట్టకుఁజాలక చెట్టుం
జెట్టునకుం దిరుగుచుండు ♦ చిలుకలవలెనే
నట్టడవులఁ బడి చనని
కెట్టులు సౌఖ్యమునితోఁచె ♦ నేరాచిలుకా!

క. వరిచేలజొన్నచేలం
బరిగలనేరికొని తినుచుఁ ♦ బైఁబడుదేగం

దెరలింపలేక దిక్కఱి
యఱమచుఁ దిరుగాడఁ గోర ♦ నౌనే చిలుకా!

క. పలుగాకితనమునను బా
ములకోరిచిచ్చెల్లఁబెట్టి ♦ పోవఁగఁ జనునే
యలవెఱఁగి బోయలొగ్గిన
వలలోఁబడఁ బ్రాణహాని ♦ వచ్చునుగాదే.

క. వనమెఱుఁగపుఁబోయల జీ
వనమెఱుఁగవునీవునిక్క ♦ వముగ స్వీయం జీ
వనమెఱుఁగవు కవిసంభా
వనమెఱుఁగవు భవనమెట్లు ♦ వదలెదు చిలుకా!

క. ఇదినీకుఁదగినసదనము
కదలకుమిటనుండి తుష్టిఁ ♦ గాంచుమయిదిగా
దదియదిగాదిదియనినె
మ్మదిఁదోఁచినరీతిఁజనకు ♦ మా! రాచిలుకా!

క. నీపెద్దలెప్పుడో యెట్టులొ
నైపుణ్యముఁజూపి మెలఁగి ♦ నారనుమిథ్యా
వ్యాపనముసుకవికల్పిత
మీపట్టుననమ్మిచెడకు ♦ మీరాచిలుకా!

క. నీనెమ్మదికిన్ మానవ
ప్రాణములకు నీవెపజ్రి ♦ పంజరమగుచున్

బూనిచరింపఁగ నేర్పరి
వేనానిచిత్రంబ్రాత్రెం • నేగఁగఁ జిలుకా !

క. పోషింతురు కాంతలు సం
భాషింతురు భాగ్యవతులు • పరమార్థవిదుల్
భూషింతురెల్లరును సం
తోషింతురునీగుణోన్న • తుల్ గని చిలుకా!

---

# జీవగీతము.

---

నీ వెవరో? జీవమా! నిన్ను ♦ నే నెఱుంగ
నాకు నీకును ననుబంధ ♦ సంబు కలిగె
నేమియో యెందులకో యిది ♦ యెఱుఁగరాదు
ఇంతకాలంబు గడచిన ♦ నేమొకాని
యెప్పు డెచ్చట నేరీతి ♦ నీవు నేను
గలసికొంటిమొ బోధంబు ♦ గాకయుండెఁ
గాని, నీవును నేనెప్పు ♦ డే నొకప్పు
డెడసిపోనుంటి మంచు నే ♦ నెఱిఁగికొంటి
జీవమా! చాలనాళులు ♦ నీవు నేను
కష్టకాలంబునను సుఖ ♦ కాలమునను
నొక్కమాదిరిగాఁ గూడి ♦ యున్నవార
మకట! నిశ్చలమై, సత్య ♦ మైన సౌహా
ర్దంబు గల ప్రియమిత్రులి ♦ ద్దఱుఁ బరస్ప
రంబువిడనాడి చనుట క ♦ ష్టంబు గాదె!
విధివిధానంబుచే నొక్క ♦ వేళ నట్లు
విడిచిపోవుటయే సంభ ♦ వించు నేని
వేఁడినిట్టూర్పు నొకసారి ♦ విడుము కంటె

నొక్కయించుక కంటిని • రోడ్చు కంటె
జీవమా! యిఁక నెవ రేమి • చేయఁగలరు!
హా! ప్రియమిత్ర ప్రియ! నను విడ • నాడునప్పుడు
నే నెఱుఁగకుండ దొంగనై • నానఁ బొమ్ము!
నా కెప్పుడు గూడ నీ ప్రసా • దమును గూర్చి
కొంచెమైనను సూచింప • నెంచఁబోకు
నీ మనసు వచ్చినప్పుడే • నీవు పొమ్ము!
పిలుపుగైకొనవలదు నా • చెంత నీవు
కాని, యింతటికంటె మే • లైనదియును
పావనంబైనదియు నైన • పదమునందు
దిరిగి యొసఁగుము నాకు నీ • దరిసెనంబు.

# ప్రణయకోపము.

---

(రాధాకృష్ణులు.)

కవులకు స్వభావవర్ణన ♦ కష్టతరము
ప్రకృతిచిత్రంబు గ్రహియింపఁ ♦ బాలకులకు
నంతకంటెను గష్టమౌ ♦ నైన సుస్వ
భావమాధురికిని లేదు ♦ పరిమితంబు.

---

జలదమాలిక నింగిపై ♦ నలరుచుండ
మెఱుఁగుదీవలు మిలమిల ♦ మెఱయుచుండఁ
బాటుపాటుగఁ జినుకులు ♦ పడుచునుండఁ
దఱచుగాక తుషారంబు ♦ గురియుచుండ
రివ్వరిక్కైన వలిగాలి ♦ రువ్వుచుండ
రేఁగి యొక్కొక్కజడి గొట్టి ♦ యూఁగుచుండఁ
గాఢమబ్బులఁ జీకటి ♦ గ్రమ్ముచుండ
నొఱపెడింగాంచి మేఘంబు ♦ లుఱుముచుండ
జోరుమని వానకాళులు ♦ జారుచుండ

స్వాంతమలరించు వర్షావ ♦ సరముఁ జూచి
మెడలు రిక్కించి కూయు నె ♦ మిళ్లఁ జూచి
ఎలమి చివి నాడు వానకో ♦ యిలలఁ జూచి.
తొంటివాయని సకదంబ ♦ తతులను జూచి
మేలుకట్టులనీలాల ♦ మేడఁ జూచి
భవనమున హంసతూలత ♦ ల్పంబుఁ జూచి
పరిణయకోపంబు దాల్పనె ♦ న్వరికెరంబు
గొల్లచేడియ రాధకుఁ ♦ జెల్లెఁగాక !

* * * * * * *

నవనవామోదబృందా వ ♦ నంబులోన
లలితమాధవీ మల్లికా ♦ లతలలోన.
రమ్యతరమైన భర్మహ ♦ ర్మ్యంబులోన
ఘనమణీమయదీపికా ♦ కాంతిలోన
బాలగోపాలుఁ డెదుటఁ గ ♦ న్పడక యున్న
కానఁబడి తన్ను దయతోడఁ ♦ గాంచకున్నఁ
గాంచి తనమాటలో మాటఁ ♦ గలుపకున్నఁ
గలిపి హర్షించి చనవుమై ♦ మెలఁగకున్న
మనసుచిడిముడిపాటుతో ♦ మసలు రాధ
పదములదరంగ నెల్లెడ ♦ వెదకు రాధ
క్షణ మొక మహాయుగంబుగాఁ ♦ గడపు రాధ

తనదుజీవమ్ము వమ్మని ♦ వలచురాధ
అతివ్యాకులచిత్త యగురాధ—♦యట్టిరాధ
మదనజనకుండు తనయెట్టి ♦ యెదుట నుండఁ
బ్రేమనిండార మదితత్త ♦ రించుచుండ
నోరుమాటాడ నువ్విళు ♦ లూరుచుండ
నోరచూపులు చల్లఁగా ♦ జారుచుండ
నెట్టినిర్బంధ మయ్యెనో ♦ యేమొగాని
యెట్టికఠినాత్మ పూనెనో ♦ యేమొగాని
యెట్టిగాడవలు పుట్టెనో ♦ యేమొగాని
యేమి యూహించెనో చెప్ప ♦ లేముగాని
వడఁకుచుండెడు మృదుగాత్రి ♦ వల్లితోడఁ
గలఁగి వెలవెల్లనగునెమ్మొ ♦ గంబుతోడ
రక్తకాంతులఁ జిమ్మునే ♦ త్రములతోడ
నశ్రుసంసిక్త గండద్వ ♦ యంబుతోడ
నోష్ఠరాగంబుఁ దొలఁచుని ♦ ట్టూర్పుతోడఁ
బ్రికటితంబగు బొమముడి ♦ పాటుతోడఁ
దల్లడిల్లుచునుండు చి ♦ త్తంబుతోడ
విభునికవ్వలిమొగమయి ♦ వెలఁది నిలిచె
నెట్లునిలువంగఁగలిగెనో ♦ యెవరికెఱుక?

* * * * * * *

అంబుదశ్యామ కోమలాం ♦ గంబువాని
తరళతరపద్మపత్త్రనే ♦ త్రములవాని
చారుచంచలభ్రూవిజృం ♦ భంబువాని
కలికి చూపుల రాగంబుఁ ♦ జిలుకువాని
పలుకుపలుకున నమృతంబు ♦ లొలుకువాని
ప్రేమగలవాని, నందుని ♦ పిల్లవాని
గాంచి యూరక మోడి వ ♦ హించుటకును
గారణం బేదొ రాధకుఁ ♦ గలుగవలయు;
రాధికాకృష్ణులదృఢాను ♦ రాగగరిమ
మెఱిఁగియున్నవారల కిది ♦ యెంత వింత !
గోపికానాయకుం డెంత ♦ కొంటెవాఁడొ
అంతకంటెను ఖండిత ♦ యగును రాధ
ఎంతకైనను మగవాఁడు ♦ కృష్ణమూర్తి
తనదునధికార మటుఁ జూపఁ ♦ దగదు రాధ
మృదులతరపుష్పసుకుమార ♦ హృదయ రాధ
నిట్టులలయింపఁదగదు శ్రీ ♦ కృష్ణునకును,
నొక్కమూలను ప్రణయంబు ♦ నొక్కమూలఁ
గోపభావంబు, రెండును ♦ గూడిమాడి
యుత్తరోత్తర మభివృద్ధి ♦ నొందుచుండ
నొండొరులచిత్తములు మార్పు ♦ నొందుచుండె—

పలుకుమని యనుచున్నదో ◆ ప్రణయమహిమ!
కూడదని చెప్పుచున్నదో ◆ కోపమహిమ!
పలుకఁగడఁగుదు రిరువురుఁ ◆ బలుక లేరు
వలపుచూపు లొండొంటితోఁ ◆ గలయఁజూచుఁ
గాని యంతలోఁ జురుకున ◆ గాడివారు
ప్రణయమహిమంబునకు వెను ◆ బాటుఁ గూర్చి
మేరమీఱినకోపంబు ◆ దారిఁజూప
సౌమ్యసంకల్పముల మేలి ◆ చాయ లెల్ల
నంతలోననె మాయంబు ◆ లగుచునుండె
నిరత మీకోపమిట్టులె ◆ నిలుచు నేమొ
ప్రణయమహిమంబునకుఁ బట్టు ◆ వదలు నేమొ
ఒరలు చొండోరు లిట్టులే ◆ యుందు రేమొ
దర్పకునకును నాఁడిమి ◆ తగ్గు నేమొ
యకట! యంతటిదాంపత్య, ◆ మంత మేలిమి,
యంతచన, వంతకూరిమి, ◆ యంత గరువ,
మంతదయ, యంతమర్యాద, ◆ యంత మోహ,
మంత యనురాగ మెచ్చట ◆ నైనఁ గలదె?
కుటిలమైన తాత్కాలిక ◆ క్రోధవహ్ని
బాఱిఁ బడి పోవఁదగినదా ◆ ప్రణయమహిమ?——
ఎంతదూరంబు పోయితి ◆ మిది నిజంబె?

ప్రణయకోపంబునకుఁ జింత పడఁగ నేల ?
కొఱవిదయ్యంబువలె భయ ♦ పడుమఁ గాని
ప్రణయకోపంబునకును రూ ♦ పంబె లేదు.
కాని యతిలోకమైనది ♦ దాని తెఱఁగు
దానికుటిలప్రకృతియు సా ♦ ధారణంబు
దానివేషంబు మాఱుమాఱు ♦ తాసకంబు
దాని స్వాంతం బనాలోచి ♦ తంబుగాదె !
కాకయుండిన ననురాగ ♦ కలితులైన
రాధికాకృష్ణులను నొక్క ♦ సౌధమందె
నిలిపి కైముఖ్యమును గూర్చి ♦ నిలువఁగలదె?—
ఆసపడి లేనిపోని యా ♦ యాసములను
తీరికూర్చుండి యెవ్వఁడు ♦ తెచ్చికొనును ?
పొలయలుకకూడఁ బ్రియముగాఁ ♦ దలఁచుచుండు
కాముకులకు వివేకంబు ♦ కలదొ లేదొ ?—
చేరి యొండొరుఁ జూచుకొ ♦ న్నారొ లేదొ
కేరునెమ్మోము కికవి ♦ న్నారొ లేదొ
నాల్గునిమిషంబులైనను ♦ మన్నారొ లేదొ
పట్టుపడిన చిత్తంబుఁ ♦ బట్టలేక
యిర్వు రిరుపంకలకుఁ బోయి ♦ రింతలోనె
ప్రియము గల్గియు నిర్వురుఁ ♦ బిలిచికొనిన.

గోర్కెఁ గల్గియు నోఁడారుల్ ♦ గూడికొనిన
మనసుపడియుఁ బరస్పరం ♦ బెనఁకొనినఁ
గోపగౌరవమున కేమి ♦ లోప మగును ?
అలుక ముక్కున నున్ననే ♦ మాయె దావ ?
మేను లీరీతి దాఁచుకో ♦ నైన దేమి ?
పాదుకొనియున్న ప్రేమాను ♦ బంధమునకు
నట్టి వేవియు సంగరా ♦ యములు గావు.
ఎదురుకొనుకొలందిని కోప ♦ మెచ్చుచుండు
నెడసిచనుకొలందిని ప్రేమ ♦ హెచ్చుచుండు
ననుచుఁ జిరకాలపరిచితు ♦ లైనయట్టి
ప్రణయకోపతత్త్వజ్ఞులు ♦ పలికినారు.

*  *  *  *  *  *  *

రాధికాకృష్ణమధ్యవ ♦ ర్తనముఁగాంచి
వారిప్రతిబింబముల నేక ♦ భావలీల
లోఁగొనెడుమణికుడ్యమా ! ♦ లోకమందు
నీవు ధన్యవుమాన్యవు ♦ నిశ్చయముగ
కాని యన్యాపదేశంబు ♦ గాఁగ వార
లాడుకొనుమాట లాలించు ♦ నట్టిభాగ్య
మెక్కడిదినీకు? వానిమే ♦ మెఱుఁగఁగలము.
రాధికాకృష్ణు లిటఁ గన ♦ రారుగాని

నారు మేమింత యెఱుఁగని ♦ వారు గారు
వారి తెవ్విడికిని యింత ♦ నారు గారు
నారిసంభాషణములను ♦ నేఱువేఱ
పలుకునవ్వేళఁ జోలిక ♦ పట్టఁగలము.
కానఁబడకుండ మాటాడు ♦ కారణమునఁ
బ్రకృతిభేదంబు లేర్పరిం ♦ పంగ లేక
పాఠకోత్తములార! ది ♦ గ్భ్రమము నొందఁ
బోకుఁడీ భావగతిఁబట్టి ♦ పోవవచ్చు.
కొంచెమయినఁ బరాకుఁగా ♦ కొనఁగఁగోక
వినుఁడు చెవియొగ్గి కౌతుక ♦ మెసయఁగాను
బలుకుచున్నది నాథ యా ♦ భావమేమొ;
"అళిపరా! నీవు చాల ధ ♦ న్యాత్మకుఁడవు
మంచిభాగ్యము నానంక ♦ మరలెదేల
పలవుఁగొలిపెడునీపువ్వు ♦ వాటిలోని
కరిగి విహరింప నిన్నెవ్వ ♦ రాఁగఁగలరు?"
అనుచు రాణిక సరోత్తమ్ము ♦ లాడుచుండ,
"ఒక్కతె తెరుకోటరంబున ♦ నున్నవార
లొట్టబెట్టిన ముట్టుకో ♦ కుండు టెట్లు?
కసరి పలికిన బెదరక ♦ మసలు టెట్లు?
లొట్టుఁ దీసి గట్టునఁ బెట్టు ♦ మోసిచిలుక!"

అనివినంబడ విచకిత • యగుచు రాధ
మనసు జల్లనఁ బాలయుల్క • ననుసరించి
తెగువ యుదయింప వెనుకకుఁ • దిరుగఁబోయి
యడుగు తడఁబడఁ జిడిముడి • పడుచు నొడలు
గడగడ వడఁకఁ బీరంబు • సడలిపోవ
నడలి బుడిబుడిఁ గన్నీరు • వాడమఁ బ్రియుని
గలిసికొన లేక మఱియటు • నిలువలేక
సంభ్రమంబున నిటునటు • జరుగుచుండ
మదనగోపాలుడుంగూడ • మదిగలంగి
తునికి మొక్కొక్క యేడాది • గాఁగహృదయ
తాపమగ్గలమైనని • లోఁపలేక
రాధికాహృదయాంతర • క్రోధవహ్ని
నార్పఁజాలు నుపాయంబు • నరయలేక
చిత్తమందేమొగాని యో • చించుచుండ
నంతలో స్యందనాశ్వహే • షారవంబు,
వచ్చె నక్రూరుఁడను జన • వాచకంబు,
"శౌరియెక్కడ?" ననెడి ప్ర • శ్నవిరావ
మొక్కమాఱుగ నుదయింప • నుదరిపడుచుఁ
దత్తరంబునఁ గేళిసౌ • ధంబు వెడలి
ముద్దుకృష్ణుండు సోపాన • ములనుఁ బట్టె

త్వరగఁ బోవుచునుండ సం ♦ భ్రమమునొంది
చిరవియోగంబునట్టె సూ ♦ చించుచున్న
కృష్ణుమధురా ప్రయాణంబు ♦ స్మృతికిరాఁగఁ
గలవలంబున వెన్నాడి ♦ కలిసికొనఁగ
పడిపడిగ రాధ యెట్టులో ♦ వచ్చెఁగాని
యప్పుడే కృష్ణుఁడక్రూరు ♦ నరదమెక్కె.

* * * * * * *

పాపమా రాధ కుత్సాహ ♦ భంగమయ్యె
నామె హృదయ భావములెల్ల ♦ సంచరించె
డిల్లపాటున గుండె గు ♦ భిల్లుమనియెఁ
గ్రిందికింకనుజను బుద్ధి ♦ మందమయ్యెఁ
బైకిఁబోవుట కెంతయో ♦ భారమయ్యె
త్రుటికినెన్నియో మెట్టులు ♦ దిగినరాధ
యెక్క లేకుండె గడియకే ♦ నొక్క మెట్టు;
అసురుసురుపుట్టెఁ, జిత్తంబు ♦ వసముదప్పె
నసిచెడియె మేను, చూపుల ♦ పస యడంగె
నబల రాధిక యేమి చే ♦ యంగఁ గలదు?
అకట! దడదడలాడు దే ♦ హంబుతోడఁ
దడఁబడుచునుండు మృదులపా ♦ దములతోడ
నమలమణిమయకుడ్యంబు ♦ నానికొనుచు

నల్లనల్లన సౌధంబు ♦ నధిగమించి
గహనమందరపర్వత ♦ కుహరవాట్లు
లతిభయంకరమ్మైనగే ♦ హంబుఁ జొచ్చి
జల్లుజల్లున గుండెలు ♦ తల్లడిల్ల
మృదులపర్యంకమున నెట్లొ ♦ మేను వాల్చి
దిగులుజెందుచుఁ జేఁజేతఁ ♦ దెచ్చుకొనిన
యెడ రసాభసింపకే తీరు ♦ నెట్టులనుచు
నోరువిఱలింపఁబోయి తా ♦ వెఱచినట్టు
లక్కటా! నేఁడు నాబ్రిదు ♦ కాయె ననుచుఁ
గ్రిమ్మఱఁగ శౌరిఁ గన్నులఁ ♦ గాంతునేని
తప్పులకుఁ బాదములఁ బట్టు ♦ దాన ననుచు
వేణుగానలోలుం డెంత ♦ విరసుఁడైన
సరస నుండుటయే నాకుఁ ♦ జాలు ననుచుఁ
బ్రియుఁడు దయతోడ నన్నుఁ బల్క ♦ రించినపుడు
చిన్నిమాటాడు మని వేఁడు ♦ కొన్నయపుడు
నేరము క్షమింపు మని దరిఁ ♦ జేరినపుడు
మోడి వహియించి నేనేల ♦ చూడనైతి?
పాడిదొరఁగి నేనేలమా ♦ టాడనైతి?
పాదుకోపంబు నేనేల ♦ వీడనైతి?
ప్రియునికడ నేల నేనొట్టు ♦ పెట్టుకొంటి?

అతనిదర్శన మింక నెట్టు ♦ లబ్బునాకు ?
ననుచు నేమేమి మదినెంచు ♦ కొనెనొ ? రాధ
తనవిశాలనయనంబులశ్రులు ♦ గురియుచుండె;
పరులహృదయంబు నెఱుఁగనె ♦ వ్వరితరంబు ?
కానియూహింప నెన్నొమా ♦ ర్గములుగలవు;
అర్థమున్నది మొగమున్న ♦ దడుగ నేల?
చెప్పనేటికిమీరె యో ♦ చించుకొనుఁడు !
సమయముంబట్టిపాత్రకథా ♦ సరణిఁబట్టి.

* * * * * *

చెలువ నిశ్చేష్టయొకొంత ♦ సేపటుండి
చారుచేలాంచలమునఁ గ ♦ న్నీరు దుడిచి
లేచికూర్చుండి యొకపత్రి ♦ లేఖనంబు
హస్తపద్మంబు కంపింప ♦ నట్టెవ్రాసి
మొదలినుండియుఁ దుదిదాఁకఁ ♦ జదివిచదివి
నిలిపినను నిల్వకుండఁగ ♦ న్నీటిధార
వరదలై పారమఱచిచదు ♦ వంగలేక
యటనిలువలేక నదుపాయ ♦ మరయలేక
తమకునకు లేఖనంపధై ♦ ర్యంబులేక
యతితరంబగు దుఃఖంబు ♦ నాఁపలేక
హస్తమందున్నపత్రిక ♦ నట్టెవిడిచి

యేమిటలపోసికొన్నదో ♦ యేమొకాని
నడలుతడఁబడుచుండ నె ♦ న్నడుముపడఁక
సౌధమునుడిగ్గి బిరబిరఁ ♦ జనియెరాధ ;

* * * * * * *

అవలనేమయ్యె ననుచు మ ♦ మ్మడుగవలదు
ప్రణయకోపంబుఁ గూర్చిన ♦ మనకథాంశ
మింతియేగానఁ దెలిపితి ♦ మింతపఱకె.
కొదవగలదేని యోచించు ♦ కొనుఁడుమీరె ;

ఐననిప్డురాధాకృష్ణు ♦ లందుఁగలుగు
ప్రణయకోపాన కేమికా ♦ రణముగలదొ
మనమెఱుఁగమైతి; మేకాంత ♦ మునఁజరించు
దంపతుల కృత్యమెవ్వరు ♦ తలపఁగలరు?
రాధికాకృష్ణులిందుఁబ ♦ రస్పరంబుఁ
గలిసికొనకుండ మనకథ ♦ గడఁచెగాని
వారలెట్లైనఁగలియక పోరుతుదకు.
ప్రణయకోపంబు వైరకా ♦ రణముగాదు
ప్రియులహృదయంబుపాషాణ ♦ మయముగాదు
కాని, యీకథయెల్లను ♦ గట్టిపెట్టి
రాధి— నాథుభావవి ♦ రాజమాన

మోహలేఖార్థముగ్రహింప ♦ ముచ్చటైన
యిదిగో! యీక్రిందనున్నది ♦ చదివికొనుఁడు.

---

" మఱచిపోవకు

# నన్ను మఱచిపోవకుము.

---

(మంజరి)

నా మనోనాయక! ♦ నా మోహఫలమ!
క్రొత్తనెచ్చెలులును ♦ గ్రొత్తయాశలును
గ్రొత్తసంతోషముల్ ♦ కోరికఁ బొంద
నరుగుదే దూరదే ♦ శాంతరములకు;
అయినను సౌందర్య ♦ మందున మిగుల
గర్వించియున్నట్టి ♦ కాంతలనడుమ
నల్లన విహరించు ♦ నప్పుడుఁగూడ
నెవ్వతె నొంటిగా ♦ నీవందు విడిచి
యరిగితివో దాని ♦ నపుడప్పుడైనఁ
దలఁచుట కొఱఁతగాఁ ♦ దలఁపంగఁబోకు.

నవయౌవనాకార ! ♦ నామోహనాంగ !
నీదగు ప్రేమను ♦ నీదుభాగ్యమును
బొంది సుఖించెడి ♦ పుణ్యమేమియును
నిరుకనాకుఁ గల్గఁబో ♦ దీజన్మమందు ;
నైనను నీదీను ♦ రాలి ప్రార్థనము,
నెదనుంచి యొకపర ♦ మీయంగవలయు
"మఱచిపోవకు నన్ను ♦ మఱచిపోవకుము"
ఈదీనదురదృష్ట ♦ మించుకయంత
తలఁచినమాత్రఁ జి ♦ త్తంబున నీకు
భరియింపరానితా ♦ పము కల్గెనేని
నేనుగోరినయట్టి ♦ యీప్రార్థనంబు
నుల్లంబులోపల ♦ నుంపఁగాఁబోకు,
ననుఁజూర్చియైన నె ♦ న్నండునుగాని
చిత్తమందింతయో ♦ చింపఁగాఁబోకు;
అటుసేయుదువుగాని ♦ యక్కటా ! నీకు
ఘనవిచారంబులు ♦ కల్గినయపుడు
నేవైన లోపంబు ♦ లెనసినయపుడు
దురదృష్టవశమునఁ ♦ దొంటియారోగ్య
దశ చెడి ధైర్యంబు ♦ దప్పినయపుడు
చిత్తశాంతి నొసంగు ♦ చెలియసాయంబు

తలచినయప్పుడు నా • ప్రాణేశ్వరుడ !

“మఱచిపోవకు నన్ను • మఱచిపోవకుము.

రాధ”

---

# వసంతకోకిల.

క. లలితకుహూకలరవమా !
యలవసరమయ్యెంటి వింద • వసుకవివరమా !
యలరువసంతుని రాకం
దలపించెదు నీకు స్వాగ • తము కోకిలమా !

క. నీరాకకలరి పికమా !
యారామశ్రీమనోహ • రాముగాన
ప్రారంభచ్ఛలమునఁ జవు
లూరన్ స్వాగతముఁ దెల్పు • చున్నది కంటే.

క. ముందే నీక్రీడావన
మందిరమునఁ బ్రకృతికాంత • మహనీయతరా
నందమునఁ దలిరుతోరణ
లందముగాఁ గట్టుచున్న • యది కోకిలమా !

క. వినరెద ప్రనీత్రుకోకిల !
కొనగలముత్యాలసరులా • కుసుమసరములో
రసపనత్రృమగానసుధా
రసకలితకుహూకుహూస్వ • రంబులో చెపుమా!

క. ఎందాఁక మాధవీలత
సుందరసుమమంజరీప్రి • శోభితమగునో

యుండాఁక మేము హీనుల
ఇంపుగ నీగానరవము ♦ వినఁగలముగదా !

క. బాలుఁడు నవపికసెతపుము
జాలరుతులఁ గోయుచున్ వ ♦ సంతారామా
ఖేలనమున నీగానము
నాలించి కుహూస్వరంబు ♦ నాలాపించున్.

క. బాలకుఁడే కాదు దివ్యక
లాలాపపరులైనఁ; దప్పి ♦ రాంచద్వీణా
లోల తంత్రులైనను,
నీలాగునఁ బలుకనేర్చు ♦ నే కోకిలమా !

క. నీకును నావికునకువలె
నే కలదా చుక్క మార్గ ♦ మెఱిఁగించుటకున్?
లేకున్నఁ దిరిగిపోయెదు
నీకాలము నెల్లు తెలియ ♦ నేర్తువు చెప్పుమా !

క. ఓమోహనగాయకమణి !
నీమందిర మెప్పుడుఁ బచ్చ ♦ నిదియే మఱియున్
నీమార్గము ద్యోమార్గము
నీమనసభినయంతేవఱుసు ♦ నిర్మలమొకదా.

క. కావంగనోము నీకా
లానన్ శీతాతపంబు ♦ లంగల బాధల్.

లేనే లేదఁసుమీ నీ
గానమున విచారసూచ ♦ కస్వరమైనన్.

క. చిగురుఁదలన నీ గానము
నెగడెనొ? లేకున్నఁ జిగురె ♦ నీగానమునన్
నెగడెనొ? నీగానంబును
చిగురు నొకట నెగడెనొ? వ ♦ చింపుము పికమా!

క. చివురాకుఁదినుము! పాడుము!
చివురులు వెట్టింపు! మలరఁ ♦ జేయుమువనమున్;
నవనవగీతాచాతురి
మివుల మరల మరలఁ బాడు ♦ మీ! కోకిలమా!

క. అయ్యో! నాకును తెక్కల
నియ్యఁడు భగవంతుఁ; డిచ్చె ♦ నేనియు నీతో
నియ్యాకసమున నెగురుచు
నయ్యాటంబులను బొద్దు ♦ జరపుదునుగదా!

క. ముచ్చటగ నెగిరికొనుచును
నెచ్చటికేనియును బోయి ♦ యఁద్వారమునను రా
వచ్చుఁగదా! విందులమై
యిచ్చటికి వసంతుఁగూడి ♦ యిల్లేఁటేఁటన్.

—

# మ ల్లె పూ వు.

---

ఫాల్గునముతోడ శిశిరంబు ♦ పరువులెత్తె
చైత్రుఁ డరుదెంచెఁ గొమ్మలు ♦ తన్వముఁ జెందె;
"చెల్లె! నేఁ గాంచి కొనుచున్న ♦ మల్లెతీవ
ముద్దులను మూటఁగట్టుచు ♦ మొగ్గఁ దొడిగెఁ
గోయకుము విచ్చుమొగ్గ యై ♦ కొమ్మండె యుండె"
ననుచుఁ దనచిన్నిసోదరి ♦ కనుసదించి
చనువుకొనఁ బోయె నంత వ ♦ సంతసేన;
చేయకుమటన్న పనులనే ♦ చేయుచుంటఁ
జిన్నిబిడ్డలసహజంబు ♦ చేష్టయెగద!
యనలచిన్నది మెత్తని ♦ మనసుగలది
కానిపని యేమి చేసెనో ♦ గాని వేగ
మొక్కపర్వునఁ దనతల్లి ♦ యొద్ద కరిగి
మనసుచిడిముడిపాటున ♦ మసలుచుండె;
చనువుకొనబోయినట్టి వ ♦ సంతసేన
ముచ్చటకుఁ దోఁటదారినే ♦ వచ్చెనేమొ;
కన్ను లెఱ్ఱఁగాఁ జెల్లెలిఁ ♦ గాంచి "యేమె!

పూవ్వఁ గోసితివా?" యన ♦ మొగముఁ ద్రిప్పి
"లేదు లే" దని నవ్వెను ♦ లేఁత నవ్వు
నవ్వ పువ్వయ్యె నేమొ! ఏం ♦ తగను దాపు
లెల్లమొడ నల్లుకొనె; "ఇది ♦ యే" మటంచుఁ
దల్లి యొడిలోనఁ జేర్చి యం ♦ తయును వెనుక
ననలయొడిలోననే యుండె ♦ నాసుమంబు;
అనల తెల తెల్లవోయి యా ♦ ననము వంచెఁ;
జప్పటలు గొట్టి కేరెను ♦ సంతసేన;
"చేసినది యొప్పొ తప్పొ న ♦ చింపవలయుఁ
దప్పు దాఁపఁ జెప్పకు మను ♦ త్వంబుఁ దల్లి!
పలుకు దాఁచినఁ జేసిన ♦ పనులు దాఁగ
వమ్మ!" యనిమందలించె న ♦ య్యనలజనని.



# చందమామ.

## I

పిల్ల లవ్యక్తమధురోక్తిఁ ♦ దల్లి చెంతఁ
జందురుని జందమామ య ♦ టందు రెప్పుడు
ముద్దులకుమూట మూటఁ ♦ గోల్చి మనము
చందమామయె యని పిల్చు ♦ మంద మతని.
కపుల కదియేమి వెట్టిరో ♦ గాని చంద
మామ యనుముద్దుపదమును ♦ మాని దాని
కెన్నొ పర్యాయపదముల ♦ నిడుచునుందు
రలరునే చందమామ దీ ♦ టైన పదము?
పాలకడలికి ముద్దుల ♦ పట్టి యనిన
సిరులనిచ్చెడు చెలువ సో ♦ దరుఁ డటంచుఁ
దేజుచేఁ గువలయ మేలు ♦ రాజటంచుఁ
జందమామకుఁ దీటురా ♦ దందు మేము.
ఉగ్గుపాలను ద్రాగుచు ♦ నున్నయపుడె
తల్లిచే విన్నదగుట జా ♦ బిల్లిపదము
చందమామకు సరిపడు, ♦ నెందు నొకటె
మాకు జాబిల్లి యనఁ జంద ♦ మామ యనిన.

శశధరుండన్న నీచోక్తి, • జలజాక్షి
యన్నభేదోక్తి, తిట్టని • చాటుఁడన్న,
సరిపడదు మాకు నీనితోఁ • జందమామ
యనియు, జాబిల్లి యనియు మే • మందుమెపుడు.

II

ఆపనియు, నీపనియుఁ జేయ • నల్లనల్ల
దినముగడచెను; రాత్రియే • తెంచె నపుడు
మిన్ను నీలపటంబు నాఁ • జెన్ను మీరెఁ,
జలువలనుచిమ్ము పున్నమ • చందమామ
నిండుకళల విరాజిల్లు • చుండెఁ; జుక్క-
లొక్కటొక్కటిగాఁ దోఁచు • చుండెఁ; గనుల
పండువుగఁ బండువెన్నెల నిండియుండె;
నఖిలజగము సుధామయ • మైనయట్లు.
మెల్ల మెల్లగ మలయస • మీరణుండు
తలిరుగొమ్మల మీఁదుగాఁ • దారుచుండె;
నేచివురుగొమ్మ నుండెనో • యెవరి కెఱుక!
కో యని వసంతకోకిల • కూయుచుండె.
వేడుకలఁ గూర్చుచల్లని • వెన్నెలలను,
హాయినొడఁగూర్చు మందమం • దానిలముల,
లలితగతి మీఱుకోకిలా • లాపములను,

గోరక చరించువారలు ♦ న్నారె జగతి!
ఆపుమైట వెన్నెలకుప్ప ♦ లాడువారు,
కోకిలము రెంబలకు మారు ♦ గూయువారు,
కల్లపాములఁ గల్పించి ♦ కాయఁ జేసి
గుమ్మ్రములఁ జిక్కుడులఁ జాలఁ ♦ గోయువారు,
తెల్లరంబున వెన్నెల ♦ వత్తి విసరి
తెచ్చి యిచ్చిన నారల ♦ మెచ్చువారు;
చిట్టిమిరియంబులును, ♦ చిప్పచిప్పగోళ్లు
చెమ్మచెక్కలు నాడిపా ♦ డించువారు;
నగుచు బాలిక లావేళ ♦ నగుచు నగుచు
నీడుజోడుగ నాటల ♦ నాడికొనిరి;
తాను యీ బాలికలతోడఁ ♦ జేరియుండె;
నీమె ముద్దులచెల్లెలై ♦ నేస్తె లలిత
"అక్కసన్నెల గొనిపోవ ♦ దయ్యె" ననుచు
వీథిగుమ్మముదాఁక వె ♦ న్వెంటఁదవిలి,
కనుమొరంగినసోదరిఁ ♦ గానలేక,
వెనుదిరిగి, తల్లికడ కేకి ♦ వెక్కివెక్కి
యెన్ని చెప్పినవినకుండ ♦ నేడ్చుచుండఁ
గోరువెట్టిన బాలిక ♦ బుజ్జగించి
లీల యొక పైడిగిన్నెలోఁ ♦ బాలు వోసి

గుజ్జుబువ్వను గలిపి యా • కూఁతు నెత్తి
చంక నిడుకొని వాఁకిటఁ • జందమామఁ
జూపి "మాతల్లి! జాబిల్లిఁ • జూచినావె!
అమ్మ బువ్వకుఁ బిలిచిన • యంతలోన
పరుగుపరుగునఁ జెంతకు • నరుగుదెంచు.
తగవుపెట్టక బంగారు • తండ్రిలాగు
బొజ్జనిండఁగఁ దిని యాడఁ • బోవునమ్మ!
తల్లితో మారమును జేయఁ • డెల్ల వేళ
నల్లరులఁ జేయ కాటల • నాడుచుండు,
మంకుపిల్లలఁ గూడఁడు; • మంచివాఁడు;
బుద్ధిమంతుండు కొండపైఁ • బోవుచుండు;
జల్లఁదన మిచ్చు; వెన్నెలఁ • జాల నిచ్చు;
నేఁడు నాతల్లి! నినుఁ జూచి • నాఁ డితండు.
బువ్వఁ దినకున్న జాబిల్లి • నవ్వు" నంచు
వెఱవెఱిఁగి లీల లలితక • న్విందుఁ జేసి
మఱియు వినవిందుగాఁ జంద • మామఁ బొగడి
కూఁతు మఱపించి పని చెప్పెఁ • జేతి కంత.
లలితమ్మాటాడుసందడి • వలనఁ దగిలి
తారమాటను మఱచి తాఁ • బోరు మఱచి
పైఁడిగిన్నియలోనున్న • పాలబువ్వ

నిండు కించుకగా నార ♦ గించుచుండె.

* * * * * * *

III

"అమ్మరో! గిన్నెలో నిది ♦ యయ్యొ; నాదు
కడుపులో నున్నసల్లని ♦ కాకిపిల్ల
పొట్ట నిండంగఁ దిని పోయె ♦ బువ్వ యెల్ల;
బలుకుచున్నది చల్లఁగాఁ ♦ బాలుద్రావి.
నేల నొకచుక్క యైనను ♦ రాలకుండఁ
ద్రాగితిని పాలు బంగారు ♦ తల్లిలాగు;
తల్లి! జాబిల్లి యల్లరి ♦ పిల్లవాఁడు;
బువ్వ నేకతిగా నొల్కఁ ♦ బోసికొనెనొ?
వేగ నాబువ్వఁ దిని పొద్దు ♦ వేసినాను
చందమామపై; నోయమ్మ! ♦ ముందు నాదు
కడుపులోఁ గాకిపిల్లయే ♦ గంతువైచె;
కలదుగాఁబోలు నీతని ♦ కడుపులోనఁ
జిన్నిదగుకాకిపిల్ల; లే ♦ కున్న నతని
యొడలిలో నల్పు గాన్పించు ♦ చున్న దేమి?
అమ్మ! యీచిన్నిజాబిల్లి ♦ కమ్మ యెవతె?
ఈతనికి బువ్వపెట్టువా ♦ రెవ్వ రమ్మ!
అక్క నాకుండె నీతని ♦ కక్క గలదె?

యితనితో నాడుకొనకుండ ♦ నెచటి కేగె ?
పోరువెట్టఁగ కొండపైఁ ♦ బోవలేక?
భయము వేయదె క్రిందికిఁ ♦ బడునో యేమొ ?
రాత్రియైనను నింటికిఁ ♦ రాక బయలఁ
జెల్లవారినదాఁకను ♦ దిరుగు నేమొ ?
ఎవరు పిల్చిన వారితో ♦ నేగి వారి
తోడఁ గూర్చుండి యెంగిలి ♦ కూడు దినునె!"
అనుచు నవ్యక్తమధురోక్తు ♦ లాడుచుండ
జనని ప్రియమంది లలిత న ♦ ర్మన గదించి
చల్లగా నుత్తరంబులో ♦ సంగుచుండ
నాఁడఁబోయిన తారయు ♦ నరుగుదెంచె.
తారహృదయంబు మెత్తన; ♦ తార కెప్పుడుఁ
జందమామను జూచుట ♦ చాలఁ బ్రీతి;
పగలు జాబిల్లి రాక యే ♦ మగునొ గాని
తారయును మింటిపైఁ జూడ్కిఁ ♦ జేరనీదు.
ఎపుడు సూర్యుఁడు గ్రుంకునో ? ♦ యెపుడు గోవు
లిండ్లకయి వచ్చుచుండునో ? ♦ యెపుడు పక్షు
లెల్ల గూండ్లకుఁ జేరునో ? ♦ యెపుడు మింట
నెఱ్ఱగాఁ దోఁచుచుండునొ, ♦ యెపుడు రేయి
యరుగుదెంచునో, తారయు ♦ నప్పుడపుడె

చందమామను జూచెదు ♦ సంభ్రమమున
నింగి నిరువంకలను దాఁగి ♦ తొంగి చూచుచుఁ
వెన్నెలబయళ్లలో నాట ♦ లన్ననామె
కెంతయో ప్రీతిగావున ♦ నెపుడు చంద
మామరాకయె గోరు నె ♦ మ్మనమునందు
గోరి తనయీడువారితోఁ ♦ జేరి తార
యాడుకొనుఁ జందమామ యు ♦ న్నన్నినాళ్లు.
సంజచీఁకటిరాత్రులఁ ♦ జందమామ
రాకఁ గోరుచు నామె త ♦ దేకదృష్టిఁ
గాచికొని యున్న నిద్దుర ♦ కన్నుఁగప్పి
నందులకుఁ దార నెవ్వ రే ♦ మందు రప్పుడు?
పోరువెట్టెడిబిడ్డల ♦ నూఱడింపఁ
జిన్నపిల్లల కాటలఁ ♦ జెలిమి నింప,
యువజనంబుల కానంద ♦ ముద్ధరింప
మంచిమందుగదా చంద ♦ మామయందు.
అరసిచూడంగ నీడుజో ♦ డైనవగుచు
భువి మనోజ్ఞంబులైన వ ♦ స్తువులు రెండె
పలుకుఁజిలికెడు ప్రియురాలి ♦ వదన మొకటి
మదిఁగరంచు పున్నమచంద ♦ మామ యొకటి.
అల్లదిగో! కన్ను మలపి మీ ♦ రరయుఁడిపుడు

మినుకుమినుకను చుక్కల ♦ మెఱయుచుండు
రమ్యతరమైన నీలాంబ ♦ రంబునందు
చల్లగాఁ గూరుచున్నాఁడు ♦ చందమామ.
పొడుపునెలనాఁ డొసంగిన ♦ పోగులెల్ల
నెత్తికొని వెండిపూఁతఁబూ ♦ యించె నేమొ
చందమామకు నునువెండి ♦ జాల రుండె
నక్షు లరమోడ్చి కనుఁగొనుఁ ♦ డల్లయదిగొ!
బాలికామణుల్ వెన్నెల ♦ వత్తు లనియుఁ
ప్రౌఢలగు సుందరులు నెల ♦ వంకలనియు
వనితలందఱుఁ జందురు ♦ వంకలనియు
ననెదరవి చందమామఁ బుఁ ♦ ట్టినవికావొ
సరిగఁ బదియేనుదినములు ♦ చందమామ
క్రమముగా సంజకే వచ్చుఁ ♦ గాని, వెనుక
నొకట నాలస్యముగ వచ్చు ♦ చుండియుండి
యేమునిద్రించుదాఁకరాఁ ♦ డేమొ తుదకు?
ఆఁడుబిడ్డ లొప్పులకుప్ప ♦ లాడువేళ
గల్లుగల్లనునద్దాల ♦ గాజులందు
నిలిచి కన్నుల మిఱుమిట్లు ♦ గొలుపుచుండు
చందమామకు నదియేమి ♦ సంబరంబొ?
ఆటసందడిలో నున్న ♦ యట్టివేళ

చెల్లికొమ్మల్లెపందుల ♦ చెంతఁజేరి
యారిన చిగుళ్లలో మంచు ♦ నీరు వోసి
యెన్ని మోముత్తియములఁ గా ♦ యించుచుండు.
ఆటలో నోడిపోయిన ♦ యట్టివారిఁ
డిల్లవోయినవారంచుఁ ♦ దెప్పఁబోవ
చిన్ని వెన్నెల నెల్లరఁ ♦ జిన్నఁబుచ్చి
తెల్లవోయినవారలఁ ♦ దెలియనీఁడు.
కొండపై నెన్నిచుక్కలో ♦ నిండియుండ
దినమునను నొక్కచుక్కతోఁ ♦ దిరుగుఁగాని
"యాడుకొనరార ! జాబిల్లి!" ♦ యనుచుఁ బిల్ల
లెంత పిలిచిన దిగిరాఁడ ♦ దేమి భయమొ!
సరిగ లేఁజిగురాకుల ♦ సందులందు
నెన్నియో వెండిపూలఁ బూ ♦ యించుచుండఁ
గనుమలపి చూడ మింటికిఁ ♦ గంటి కొకట
వెండితీఁగె లెన్నెన్నొ క ♦ ల్పించుచుండు.
అంటఁగా ముట్టఁగా రాని ♦ యట్టిచోట
నిలిచి దాఁగిలిమూఁతల ♦ నెఱపుఁగాని
యీడుజోడైనవారితో ♦ నాడుకొనఁగ
జతలుగూడఁ డిదేమొకో ♦ చందమామ.
ఒక్కమాటుగఁ దెరచాఁటు ♦ నుండివచ్చు

భామవేషంబులె మబ్బు ♦ ప్రక్కనుండి
చటుకునను వచ్చుచుండు నీ ♦ చందమామ
యీపాటికి నింతయొయ్యార ♦ మెందుకో టకో ?
చందమామ యదేమొ కా ♦ నారవారి
ఘారములలోన మాటికిఁ ♦ దూరుచుండు?
పలుచితిమి కవితావేశ ♦ పరవశతను
కలదుగా యట వలపించు ♦ కలువకన్నె !
తుమ్మెదలఁ గాంచి గీతమా ♦ ధుర్య మెంచు
మల్లెపూవులఁ గలపరి ♦ మళముఁ గాంచు
నాయునందనుతోఁ జేయి ♦ చేయిగలపు
సరససుకుమారబలుఁడుమా ♦ చందమామ!
నిండుగా నొక్కనాఁడు గా ♦ న్పించినంత
నెవరిదృష్టులు తాఁకునో ♦ యేమొకాని
నాఁడునాఁటికిఁ గృశియించి ♦ పాడిదప్పి
తిరిగి నెలనాళ్లదాఁకను ♦ తేరుకొనఁడు.
ఎలమి నంతఃపురంబుల ♦ కెగయఁ బ్రాఁకి
ముంగిటి గవాక్షములఁ దొంగి ♦ తొంగి చూచుఁ
దేరి చూచిన మిన్నక్క ♦ కూరుచుండుఁ
దుందుడుకు బాలకుఁడు గాఁడె ♦ చందమామ ?
లలితకరకిరణముల జా ♦ లంబులల్లుఁ

దోయనిధివీచికలలోనఁ ◆ దూఁగి యాడు
మబ్బుటోడలపై నెక్కి ◆ మాయ పొంగును
బాలురు చెల్మిఁగనె నేమొ ◆ చందమామ!
చందమామనుగను టెంత ◆ సంబరంబొ

సలిలకలశంబు చెప్పఁగాఁ ◆ జాలకున్నఁ
బాడగనినమాత్ర నుప్పొంగి ◆ పోవుచున్న
కలశవారాశిఁ గనియైనఁ ◆ దెలిసికొనుఁడు.
తెల్లనగు కాగితముమీఁదఁ ◆ దిరిగితిరిగి

కలము గంతులువేయంగఁ ◆ గలదుగాని
నల్లనగునింగి నల్లన ◆ నడచుచున్న
చందమామను వ్రాసి మె ◆ ప్పొందగలమె?



# ప్రభాతవాతము.

---

చ. మముఁ బరమార్థమైన యొక
మాట వచింపఁగరాదు నిత్యస
త్యమునకుఁ జేరువైనదియొ?
స్వానుభవంబునఁ గూఁతమైనదో?
క్రమముగ మీకె తోఁచెదుఁ; బ
రాకున నైనఁ బ్రభాతవాతపో
తము నెడ నమ్రరాదనెడి
తత్త్వమె బోధయొనర్తు మియ్యెడన్.

చ. ఘనమునఁ బక్షపాతమును
మాని వచింపుఁడు మీరె; యేకతం
బున యువదంపతుల్ నిదుర
వోవుచునుండఁగఁ దట్టి లేపఁగా
దనకుఁ బనేమి? యిట్లుకల
దా? యిది సిగ్గులచేటుగాదె? యే
మఱఁదగు నీప్రభాతసమా
యాగత ధూర్తసమీరడింభకున్ !

సీ. జలతరంగముల ను ♦ య్యెలలూఁగి నట్లుండి
తఱివేచి చలువలఁ ♦ దస్కరించు
సరసిరిమొగ్గల ♦ నలరించి నట్లుండి
యదనెంచి రజమెల్ల ♦ నపహరించు
లతకూన చెంత మె ♦ ల్లగనున్న యట్లుండి
సమయంబుఁగని చుట్టు ♦ నడలఁ జేయు
ననగొమ్మ నిట్టె యూఁ ♦ చినయట్టులే యుండి
కొంటెయై వలపులఁ ♦ గొల్లవెట్టు
చలువ తెక్కలికాఁడు, ర ♦ జంపుదొంగ,
పైఁడిపచ్చఁడు! తావుల ♦ బందెగాఁడు,
ప్రాతరనిలార్భకుఁడు తడి ♦ పాత గొంతు
కోఁతగాఁ డాతనిని నమ్మఁ ♦ గూడ దెపుడు.

---

# ఆత్మసఖుండు.

---

ఎప్పుడు నీవెంటఁ దిరుగువా • రెందఱున్న
వారలందఱు మిత్రులు • గారునీకు
వారిపరిహాసములు, ప్రియ • భాషణములు
పొగడికలు గాలితోఁ గూడఁ • బోవుచుండు.

ఆటపాటలకును గోటు • నీటులకును
వింతలకు వీడియములకు • విందులకును
నెన్నినాళ్లీవు ధనము వ్య • యింపఁగలవొ
యన్నినాళ్లును వారు నీ • కాత్మసఖులె.

ఈవిలోనైన విందుల • నిడుటనైన
కొదవయించుక నీయెడ • నొదవెనేని
దినదినము నిన్నుఁ గనవచ్చు • ఘనులదేమొ
యేఁడునకునైన దర్శన • మీయరేరు.

భయమొ, బాంధవ్యమో, మత • పరిచయంబొ
కారణంబుగఁ గలిగిన • కలయికలకు
సమయముంబట్టి మార్పులు • జరగుచుండుఁ
గాని మిత్రత్వమట్టిది • కాదుకాదు.

సహజధర్మంబు చేసనన్న ♦ చనవుఁజూపు
సత్కులాచారమున భార్య ♦ సరసమెలఁగు
వృత్తిధర్మంబున భటుండు ♦ వేఁడికొలుచు
నంతమాత్రన మిత్రుఁడ ♦ మనఁగరాదు.
అనిశమానంద దాయక ♦ మైనయట్టి
నీదుభాగ్యంబుతోఁ గూడ ♦ నీప్రియులును
పూర్వపరిచితులుంగూడఁ ♦ బోవుచుండ్రి
ప్రొద్దుతోఁగూడ వెల్తురుల్ ♦ పోవునట్లు.
కలిమి లేములయందొక్క ♦ గతిఁజరించి
కష్టసుఖములలోన భా ♦ గంబుగొనుచు
కష్టమైనను హితమును ♦ గఱపుచుండు
వాఁడె సుమ్ము నిజమ్ము నీ " ప్రాణసఖుఁడు.
ఆత్మబంధులు బాసి యి ♦ ల్లాలు రోసి
పొరుగువారలు తలుపులు ♦ మూసినపుడు
దివ్వెతోఁగూడనున్నట్టి ♦ తేజువోలె
నెవఁడు నినుబాయఁడతఁడె నీ ♦ యిష్టసఖుఁడు.
పేదవడిపోయి యాఁకలి ♦ చేఁ దపించి
దిక్కులేనియవస్థలోఁ ♦ జిక్కినపుడు
చేతనైనంత సాయంబు ♦ చేసి యెవఁడు
నీకుఁదోడగు నాతఁడే ♦ నీసఖుండు.

ధనమునకుఁగాక నీదుమె • ప్పునకుఁ గాక
కీర్తికింగాక ప్రీత్యు • పకృతికిఁ గాక
చిత్తశుద్ధిగనీకు మే • ల్సేయునెవఁడు
నిజముగాఁ జూడనాతఁడే • నీసఖుండు.

ఎవనిచిత్తంబు నీచిత్త • మేకమగునొ
ఎవనిజీవంబు నీజీవ • మేకమగునొ
యెవనివృత్తంబునీవృత్త • మేకమగునొ
యాతఁడేసుమ్ము నమ్ము నీ • యాత్మసఖుఁడు.



# నిన్న, నేఁడు, ఱేపు.

——

సంతసంబో, విచారమో, ♦ సంభవించు
సుఖమొ, కష్టంబొ మఱినీవు ♦ చూడలేని
దాని, నీజన్మమున నిఁక ♦ రానిదాని
నీవు గాంచితి వెప్పుడు ? ♦ నిన్న ! నిన్న !
నీవు పోయెదుతో్రినలో ♦ నీయదృష్ట
దేవతయభీష్టఫలములం ♦ దించుచుండ
నాఁగి వేవేగముగ వాని ♦ నందికొనఁగ
నెపుడు కోరెదవీవు? నేఁ ♦ డేగదయ్య !
కాని, యాదేవి విముఖయై ♦ కానిపించి
ముందురాఁగోవు నీకష్ట ♦ ములను దెలుప
నట్టికష్టంబులెల్ల నీ ♦ వనుభవింప
వలసినప్పుడు ఱేపుగా ♦ వలయు నీకు.
పుణ్యమో పాపమో నీవు ♦ పూనుకొన్న
యొక్క కార్యంబు నెఱవేర్చు ♦ చున్నయపుడు
మంచిచెడ్డలఁగూర్చి యో ♦ చించు టెపుడు?
తెలివిగలదేని నిన్నటి ♦ దినముసందె.

అపకృతియొనర్చి నీకుఁ దా ♦ నవల నెఱిఁగి
సిగ్గుపడుచుఁ బశ్చాత్తప్త ♦ చిత్తవృత్తి
దీనుఁడై వేఁడుకొనుచున్న ♦ వానితప్పు
నీవు క్షమియింపఁదగినది ♦ నేఁడె నేఁడె!
గురుతరక్రోధవశమున ♦ నొరునిఁగీడు
పఱిచి నీతప్పు నీవుగా ♦ నెఱిఁగినపుడు
వానిక్షమియింపఁ గోరఁగా ♦ వలసెనేని
నీకు సమయంబు ఱేపటి ♦ దాఁక లేదు.
ఒరులకడ దాఁచికొన్నదో ♦ యొరులవలన
రావలసియున్న యట్టిదో ♦ కావలసిన
నవసరంబైనయపుడు నీ ♦ కందఁ బోదు
తెచ్చికొనఁదగు నిన్నటి ♦ దినమునందె.
తీరుపుంగాంచి ధనము తే ♦ తెమ్మటంచు
నప్పులిచ్చినయతఁడు ని ♦ న్నడ్డగించి
తీవరంబునుజూపి వే ♦ ధించెనేని
నిలువఁబడి తీర్పఁదగు నీవు ♦ నేఁటిదినమె.
సాక్షిలేకయొ, కాలదో ♦ షంబుగనియొ
యన్యుకడ నీవు తెచ్చుకొ ♦ న్నట్టి ఋణము
ప్రకృతశాసనమునఁ గొట్టు ♦ వడిననైన
మాసదది; తీర్పవలయు ఱే ♦ పైనఁగాని

---

నేఁడు ఱేపటికింజూడ • నిన్నయగును
ఱేపు నేఁడగుచుండును • ఱేపటికిని
నిన్న, నేఁడు, ఱేపనుకాల • మెన్నివేల
యేండ్లనుండియు రొకరీతి • నేగుచుండె.

---

# రాజభక్తి.

---

క. శ్రీయాదవకులభూషణుఁ
డై యొప్పెడు కుంతిభోజుఁ ♦ డను రాజు ప్రభు
త్వాయత మహిమాన్వితసు
శ్రీయుతుఁడై వెలయు సుప్ర ♦ సిద్ధుండగుచున్.

గీ. అతని తనుజాత సకలగు ♦ ణాభ్యుపేత
ప్రథ యనఁగఁ గుంతి యనఁగను ♦ వెలయుచుండు
నా సతీమణి కభ్యాగ ♦ తార్చనమున
నతిథి గురుపూజలందుఁ బ్రి ♦ యంబు ఘనము.

క. ఆ సాధ్వీరత్నము దు
ర్వాసోముని మంత్రమహిమ ♦ భాస్కరుకరుణం
జేసి కని యొఁ గన్యాత్వం
బోసరిలక మున్నె తనయు ♦ నొక్కని ననఘున్.

గీ. గోలతనమునఁ దానట్లు ♦ గోరికొనఁగ
దినమణి యొసంగినట్టి నం ♦ దనుని వలన
నాభిజాత్యంబు రూపఱె ♦ నంచు వగచు
నామెఁ గని భాస్కరుండు ద ♦ యాళుఁ డగుచు.

గీ. కన్యకాత్వంబు దూష్యంబు ♦ గాకయుండ
వరమొసంగిన నూఱడి ♦ తరుణియంతఁ
దామరాకుల దొన్నెలోఁ ♦ దనయునునిచి
గంగలోపల విడిచె దుః ♦ ఖంబుతోడ.

క. ఆవెనుకఁ గొంతకాలము
పోవఁగ నాసాధ్వి పాండు ♦ భూపాలునకున్
దేవియయి కనియెఁ దనయులఁ
బావనులను ధర్మభీమ ♦ పార్థులఁ బరుసన్.

గీ. గంగలోనిడ్డ నెత్తురు ♦ కందు కొట్టి
కొనుచుఁబోవంగ సూతుఁడో ♦ క్కరుఁడు గాంచె
సహజకుండల భాసితు ♦ మహిత తేజుఁ
గనులు మిఱుమిట్లుగొని మది ♦ కలుకుమనఁగ.

గీ. పెన్నిధింగనుఁగొన్నట్టి ♦ పేదవోలె
తా సపుత్రకుఁ డగుట నా ♦ కూన నెత్తి
పరుగుపరుగున నింటికి ♦ నరిగి తనదు
వనితకిడి ప్రేమమునఁ బెంచి ♦ కొనుచునుండె.

గీ. కర్ణుఁడనుచు నామ ♦ కరణంబుఁ గావించి
బిడ్డకాలుకిందఁ ♦ బెట్టనీక
యలరఁ జేయుచుండఁ ♦ దొలిపెక్క నెలవోలె
దినదినాభివృద్ధి ♦ గనియె నతఁడు.

గీ. సూతపుత్త్రుఁడయ్యు • సుక్షత్త్రియకుమార
వరులనెల్ల మించి • వరలు ననుచు
లలిత కవచకుండ • లములఁ గన్గొనిజను
లబ్రమొంద నాతఁ • డలరుచుండు.

గీ. పాండుభూపాలువెనుక న • ప్పాండవులను
దనసుతుల నేకరీతిగాఁ • బెనిచికొనుచుఁ
గురువిభుఁడు వారలకు ధను • ర్గురునివలనఁ
జేర్మి ధనురాగమంబు నే • ర్పించుచుండె.

క. ధృతరాష్ట్రుని తనయుండు
ధృతుఁడగు దుర్యోధనునకు • నాకర్ణునకున్
బ్రతికిన బ్రతుకుట, మృతిఁగన
మృతిఁజెందెడు నంతపాటి • మిత్త్రత గల్గన్.

గీ. అతఁడు సూతుఁడు నేరాజు • ననెడిభేద
మొక్కయింతయు లేక దు • ర్యోధనుండు
కర్ణుఁగూడ సహాధ్యాయి • గానొనర్చె
ప్రభుఁడుతలఁచినఁ దీరని • పనులుగలవె?

గీ. అన్నదమ్ములకును బిడ్డ • లైనయట్టి
పాండవులకుఁ గౌరవులకు • బాల్యమాది
నాటలందు సైతము వైర • మగుచునుండె
భీమబలుఁడై మెలంగెడు • భీమువలన.

క. అట్టియెడ నాంగికేయుని
పట్టికిఁ దాఁ జేయిదోడు ♦ వాదోడగుచున్
నెట్టన విశ్వాసము చూ
పట్టె మొాఁగుఁ గర్ణుఁ డనిశ ♦ భక్తిపరుండై.

క. విలువిద్య నొండొరులకుం
గలభేదముఁ దెలియఁ బార్థ ♦ కర్ణులఁ జేరం
బిలిచి గురుఁడు మిాశక్తుల
వెలయింపుండనిసఁ గనలి ♦ భీముండతన్.

క. సూతసుతుఁడు సత్కులసం
భూతుండగు క్షత్రియోత్త ♦ మునితో నెనరై
పోతరమున నస్త్రకళా
చాతుర్యముఁ జూపుటార్య ♦ సమ్మతమగునే?

గీ. అనిపచింప దుర్యోధనుఁ ♦ డంగరాజ్య
మితనికొసఁగితి రాజయ్యె ♦ నింతనుండి
యని కిరీటంబు గొడుగుఁ గ ♦ ర్ణున కొసంగి
ప్రభుకుమారులలోపలఁ ♦ బ్రభునిఁ జేసె.

గీ. అస్త్రవిద్యాప్రదర్శన ♦ మందు నాఁడు
కర్ణపార్థు లొండొరులను ♦ గడచుకతన
కర్ణసాహాయ్యమే తన ♦ కార్యసిద్ధి
నొసఁగు నని నమ్మియుండెడు ♦ దుర్యోధనుండు.

గీ. బాల్యమాది పాండవులతో ♦ వైరమగుట
నొక్కసమయంబునందు దు ♦ ర్యోధనుండు
శకునిధర్మజులకును జూ ♦ దంబుఁగూర్చి
యనఘులగువారి రాజ్యంబు ♦ నాక్రమించి.

గీ. వనమునకునేగి ద్వాదశా ♦ బ్దములుగడుప
నూరనజ్ఞాతవాసంబు ♦ నొక్కయేఁడు
గడుప వారల నొప్పించి ♦ వెడల నడచి
కృత్రిమపథానువర్తి దు ♦ ష్కీర్తి దాల్చె.

గీ. పాండవులు దానునేకగ ♦ ర్భస్థులగుట
తెలిసియుండియు వారింప ♦ వలఁతియయ్యు
తన్నుమన్నించునృపతి చి ♦ త్తంబుకీతి
నంగపతి పోయెఁగాని వ ♦ ద్దనకయుండె.

క. తమ్మెఱిఁగి ప్రోచునృపుచి
త్తమ్మునకున్ వచ్చిమెలఁగు ♦ తఱి తమతమవి
త్తమ్ములఁ, దమ్ములఁ, దమ్ముల
నిమ్ముల విడనాడికొనెద ♦ రిద్ధచరిత్రుల్.

క. తఱచినకొలందిఁ గర్ణుని
చరితంబున రాజభక్తి ♦ సంపన్నతయున్
గురుతరధీబలతేజ
స్స్ఫురణంబును దోఁచుచుండుఁ ♦ బూర్ణముగాఁగన్.

గీ. ఘనులు కాననవాసాది ♦ కంబుఁ దీర్చి
పాండుసుతులుదుర్యోధను ♦ పాలి కోకట
రాజ్యభాగంబునుం గోరి ♦ రాయబార
మాల్లవసుదేవనందను ♦ నంపినపుడు.

క. సంధి కుదురంగనీక మ
దాంధత దుర్యోధనుండు ♦ హరి శ్రీకృష్ణున్
బంధింపఁ దలఁప నాగ
ర్వాంధుని యూనతినె పోవఁ ♦ డా కర్ణుండున్

క. కౌరవపాండవులకుఁ గల
వైరము వారింప వలను ♦ పడకుండుటచే
శౌరి చనుచుండి కర్ణునిఁ
జేరి పలికె మృదులమధుర ♦ శీతలఫణితిన్.

క. బావా! సూతసుతుఁడ వని
నీవనుకొనుచుంటి వేమొ ♦ నిజముగఁ గుంతీ
దేవితనయుఁడవు భారత
భూవరుడవు ధర్మరాజ ♦ పూజ్యుఁడవు సుమీ!

గీ. అగ్రజుఁడవౌట నీవు రా ♦ జ్యంబు గొనుము
వలచు ద్రౌపది యాఱవ ♦ వరుస నిన్ను
నఖిలరాజన్యమణులు ని ♦ న్నాశ్రయింతు
రితరులనుగొల్చి బ్రదుక నీ ♦ కేలయయ్య?

గీ. మాత్స్యయాదవ పాంచాల ♦ మనుజపతులు
నీపనుపు సేయ నిరతంబు ♦ నిన్నుఁ గొలుచు
ధర్మరాజాదులకడఁ బె ♦ త్తనముఁ దాల్చి
నీదొరతనంబు నెమ్మియు ♦ నెఱపుమయ్య.

క. అనవుడు శ్రీకృష్ణా! నా
జననం బెఱుఁగుదును; ధర్మ ♦ జప్రముఖులు నా
యనుజులగు టెఱుంగుదు; నై
నను గురుపతినెట్లు విడుతు ♦ నమ్మినప్రభునిన్?

క. నన్నెఱుఁగరు కౌంతేయులు;
కన్నెరికమునందె కుంతి ♦ కని విడిచెను న
న్నన్న నగరె యేమని మీ
యన్న ననుచుఁ జేరువాఁడ ♦ నాపాండవులన్.

క. జననీజనకులకంటెను,
ననుజన్ములకంటె, బాంధ ♦ వావళికంటెన్,
ననుఁ బెద్దఁజేసి దుర్యో
ధనుఁ డింతటివానిఁ జేసె ♦ దయదైవారన్.

గీ. అంతియేకాక పార్థునే ♦ నొంతుననుచు
నమ్మియున్నాఁడు దుర్యోధ ♦ నప్రభుండు
అట్టియేలిక విడిచి మీ ♦ యన్న ననుచుఁ
బాండవులతోడఁ జేరుటే ♦ పాటికీర్తి?

గీ. ధర్మజుఁడు చక్రవర్తి కాఁ • దగినవాఁడు
అన్నగా నన్నెఱింగిన • నట్టిపదవి
నతఁడు గోరఁడుగాన నె • ట్లైనఁ గృష్ణ!
యీరహస్యంబు బయలుగా • నీకుమయ్య!

క. అని వాసుదేవుతోడన్
వినయము గౌరవము దోఁప • విశదపఱచి కృ
ష్ణున కనిపెఁ దగిన తెఱఁగున
ఘనమతి కర్ణుండు రాజ • కార్యపరుండై.

క. ఒకనాఁడు కుంతి యొరులెఱుఁ
గక యుండ రహస్యవృత్తి • గంగానది చెం
తకుఁ జని జపయుక్తుని పు
త్రకునిం గని సూర్యజపవి • ధానాంతమునన్.

క. తనరాకఁ దెలిపి యాతఁడు
తన తనయుం డగుటఁ దొల్లి • తపనునివలనన్,
జనియించుటాది యాతని
జననకథం దెలిపి నిలుపఁ • జాలనికరుణన్.

క. పరితాపామోదాశ్రువు
లిరుగన్నుల కొనలనుండి • యిరుదెరఁగులుగా
నొరలుచు ననుఁగుకుమారుని
శిరమున్ దడుపఁ గవుఁగింటఁ • జేర్చి పలికెన్.

గీ. అకట! సుకృతిప్రియుండ వీ ♦ వయ్య సూతుఁ
డితఁ డనెడిపేరు మోయ నీ ♦ కేటికయ్య ?
భారతార్ధరాజ్యరమాను ♦ భవము గలుగ
నితరులం గొల్చి బ్రదుక నీ ♦ కేలతండ్రి !

క. ఊరక దాయలపొత్తుం
గోరి దయన్ విడిచి తమ్ము ♦ కుఱ్ఱులతోడన్
వైరముగొని దారుణరణ
ధారణి నెదిరింప నీకు ♦ ధర్మమె చెపుమా !

క. అనివగచె గద్గదని
స్వాసము గదురఁ గరుణ దోఁప ♦ జనని పలికినన్
విని రాజభక్తిపూరిత
ఘనహృదయుఁడు ధీరుఁడైన ♦ కర్ణుం డనియెన్.

గీ. ఎపుడు కన్నీరు విడుచుచు ♦ నీవు నన్నుఁ
గడుభయంబున విడిచితో ♦ గంగలోన
నాఁడె నీకును నాకు ఋ ♦ ణంబు దీరెఁ
దనయునిగ నన్ను నీవింకఁ ♦ దలఁప కమ్మ.

గీ. ఏను పార్థుని ననిలో జ ♦ యింతు ననుచు
నమ్మియున్నాఁడు దుర్యోధ ♦ నప్రభుండు
కర్ణపార్థుల నెవ్వరు ♦ ఘనులొ యనుచుఁ
జూడనున్నారు తక్కిన ♦ జోదులెల్ల.

గీ. తల్లి! మనసిచ్చి మేలినా ♦ తనినిదోఁప్రి
యెలమిఁ బెంచినతల్లిదం ♦ డ్రులను మఱచి
క్షత్రియోచిత మగుపౌరు ♦ షంబు విడిచి
యెట్లు వచ్చెద నీవెంట ♦ నేనటంచు.

గీ. అతని నేనొంప నాతోడ ♦ నైదుగురము
నతఁడు నన్నొంప నైదుగు ♦ రనితోడఁ
గాని పార్థకర్ణులు చెల్మిఁ ♦ గనుట, పుత్రు
లార్యురుండుటయును కల్గ ♦ దమ్మ యింక!

గీ. పరులఁ జేరితి నని దుఃఖ ♦ పడకు మమ్మ!
సోదరఘ్నునిగా నన్నుఁ ♦ జూడకమ్మ!
ప్రభుఋణముఁ దీర్పఁగా నొక్క ♦ పార్థుకంటె
దొరకినను పెరతమ్ముల ♦ దునుమనమ్మ!

క. అని యనునయమునఁదల్లిన్
ఘనమతినూరార్చి పంపెఁ గాని ♦ జననికై
తన రాజభక్తి విడువఁడు
ఘనుఁడగు కర్ణుండు; పొగడఁ ♦ గలమే యతనిన్.

క. గరువతనంబున సుస్థిర
తరపౌరుషమందు రాజ ♦ ధర్మమున నిజే
శ్వరభక్తియందు సుగుణా
కరుఁడగు నంగపతిఁ బోలఁ ♦ గలరే యితరుల్?

గీ. ఎల్లప్రియవస్తువులమించు ♦ తల్లిప్రేమ
వరబలంబులమించు సో ♦ దరులతోడు
అన్నిటనుమించు నాభిజా ♦ త్యంపుగరిమ
తృణముగా రాజభక్తి క ♦ ర్ణుడు జేసె.

గీ. అధిపుమార్గంబు ధర్మబా ♦ హ్య మని యెఱిఁగి,
యనుఁగుఁదమ్ముల కప్రియం ♦ బని యెఱింగి
తనకు గెల్పుట చేకూఱ ♦ దని యెఱింగి
కట్టువడెన స్వామిభక్తికిఁ ♦ గర్ణుఁ డౌర!

గీ. తన్నుఁ గురువృద్ధుఁడెంతయు ♦ ర్ధరఘుఁ డన్న
చేరి ద్రోణజుఁ డెప్డు దూ ♦ షించుచున్న
పరులు సూతజుఁ డని యెంత ♦ పలికికొనిన
స్వామిభక్తికై కర్ణుండు ♦ సైచె నహహా!

గీ. స్యందనము కుంగినను, పార్థు ♦ శరచయంబు
ముంచుకొనుచున్న, నుసురు చ ♦ లించుచున్నఁ
గాని తానెంతధీరుఁడో ♦ కర్ణుఁ డట్టి
సమయముననైన విడువఁడు ♦ స్వామిభక్తి!

గీ. తల్లిపైఁ బ్రేమ; తమ్ములం ♦ దలిప్రియంబు,
కులమునందు గౌరవమును, ♦ కౌరవులందు
నలరువాత్సల్యమును, ప్రాణ ♦ మందు నాస
వదలుకొనె నంగపతి రాజ ♦ భక్తికొఱకు.

# గురుభక్తి.

---

క. సూనఫలభరిత తరుయుత
కాననవల్లీమతల్లి • కావాస కిరా
తానీకనేతయై విన
యానతుఁడు హిరణ్యధన్వుఁ • డనునతఁడొప్పున్.

క. ఆయెఱుకురాజునకు సుగు
ణాయత్తుం డేకలవ్యుఁ • డనునతఁడు సుతుం
డై యుద్భవించె ధర్మము
మేయస్థితి మూర్తిఁదాల్చి • మెలఁగు విధమునన్.

క. ఆసుగుణున శస్త్రకళా
వ్యాసంగమునందుఁ గోర్కె • యగ్గలమగుటం
జేసి సమర్థుండగుగురు
నాసించి చరించుచుండె • నాయాయెడలన్.

క. ధనురాచార్యుఁడు ద్రోణుఁడు
ఘనమతి రాసుతుల కెల్లఁ • గరిపురి నావి
ద్యను నేర్పుచుండె నంచును
విని యాతనికడకుఁ జేరి • వినయానతుఁడై.

గీ. హేగురూత్తమ! నేనొక్క ♦ యెఱుకువాఁడ,
శస్త్రవిద్యార్థినై భవ ♦ దంతికమున
కరుగుదెంచితి శిష్యుఁగా ♦ నరయుమయ్య!
కరుణనావిద్య నాకును ♦ గఱపుమయ్య!

క. అనవిని ద్రోణాచార్యుం
డనుమానము నొందుచుండ ♦ నట రాకొమరుల్
కని శూద్రున కస్త్రాభ్యా
సనియతి యేమిటికి రాజ ♦ సంతతితోడన్.

క. మరియాదగాదు రాజుల
కెఱుకు సహాధ్యాయియగుట ♦ యెందును గలదే?
సరిసరి లే పదపదమని
పరిహాసము చేసి రంత ♦ బాణగురుండున్.

క. వారిమనమెఱిఁగి బోయకు
మారునకుం బ్రియము సెప్పి ♦ మఱియెక్కడకున్
జేరుము నీకోరిక చే
కూఱకపో దెచట నేని ♦ గుఱిగలదేనిన్.

క. అని యీగతి నాతని సాం
త్వనవచనంబులను దనిపి ♦ పదమన నసఘా!
పనిపినియెద దయయుంచుం
డనిపదముల కెఱఁగి యాతఁ ♦ డరుగుచు మదిలో

క. గుఱియున్న నెల్లవిద్యలు
కరగతమౌ ననుచుఁ దెల్పఁ ♦ గాఁబడెనుగదా!
గురువాక్య మింతయొప్పునె?
గుఱియను రెండక్షరములె ♦ గురుమంత్రమగున్.

క. అని కృతనిశ్చయుఁడై యా
ధనురాచార్యు నెదలోనఁ ♦ దలపోయుచు నా
తనిరూపము మృత్తికతో
నొసరించి యనూనభక్తి ♦ యుతుఁడై కడఁకన్

క. ఆవిగ్రహంబె గురువుగ
భావించుచు నస్త్రశాస్త్ర ♦ పద్ధతులెల్లన్
వేవేగము నభ్యాసము
గావించుచునుండె నతఁడు ♦ గడునిపుణుండై.

క. అమలధనుర్వేదము సాం
గముగా నేర్చికొనె నతఁడు ♦ కలితాభ్యాస
క్రమమున, గుఱిగల్గినచో
విమలమతుల కందరాని ♦ విద్యలుగలవే?

ద్రోణశిష్యులందు ♦ దొడ్డవాఁడని పేరు
నొందియున్నపార్థుఁ ♦ డొక్కనాఁడు
విల్లునమ్ములూని ♦ వేఁటాడ వేడ్క నీ
యెఱుకుపాలము ♦ చెంత కేగుదెంచి.

ఆ. ఏకలంబు తన్ను ♦ నెలయించుకొనిరాఁగ
వచ్చివచ్చి యొక్క ♦ వాఁడితూపు
వింటఁబూన్చి కూల్చు ♦ వెఱపున నేయంగఁ
దప్పిపోయి పంది ♦ తాఁటుయును.

ఆ. తఱిమికొనుచుఁ బోవు ♦ తఱి నేకలవ్యుండు
దానిఁగాంచి చేతి ♦ ధనువునెత్తి
మొగమునాటి పుచ్చు ♦ మునదూఱి పోవంగ
నాఁటుశరము లొక్క ♦ దారినేయ.

గీ. అట్టిశరలాఘవంబును ♦ కబ్బిమంది
యిట్టులేసినధన్వి తా ♦ నెవ్వఁడొక్కొ?
యనుచు నెంచుచు నాదారి నల్లనల్ల
నరిగి యందొక్కధారుణీ ♦ ధరముచెంత.

క. ఘనశస్త్రాస్త్రంబులసా
ధన చేసెడు నేకలవ్యు ♦ దరిఁజేరి నయం
బుననీవెవ్వండని య
ర్జునుఁడడుగ హిరణ్యధన్వు ♦ సుతుఁడిట్లనియెన్.

క. అనఘా! నే ద్రోణాచా
ర్యునిశిష్యుఁడ నర్జునకుఁడ ♦ నోపికతోడన్
ధనురాచార్యునికరుణ
మ్మున ధనురాగమరహస్య ♦ ముల నేరిచితిన్.

క. అనవిని సముచితగతి నా
తని పీడ్కొని యర్జునుండు ♦ తనగృహమునకుం
జనుదెంచి మదిగలంగఁగ
ధనురాచార్యుకడ కేగి ♦ తనికినవగతోన్.

క. నీయట్టిధన్వి జగమున
నేమెడలేకుండునట్టు ♦ లేఁ జేసెదనం
చోయనఘ! బాసఁ జేసితి,
వాయమగునె తావకీన ♦ వచనం బెప్పుడున్.

క. నేఁటికి విలువిద్యను గడు
మేటిని గనుఁగొంటి నన్ను ♦ మించినవాఁ డా
పాటిపుళిందుని జూడము
పోటుమగలమూఁడులోక ♦ ములనేయెడలన్.

గీ. ఆతఁడెఱుకు భవచ్ఛిష్యుఁ ♦ డఁటమహాత్మ!
యనుచుఁ దాఁగన్నయంతవ ♦ ట్టును దెలుపఁగ
ద్రోణుఁ డాశ్చర్యమగ్నుఁడై ♦ తోంటివృత్త
మెఱిఁగి పార్థునితో వని ♦ కేగుదేర.

గీ. ఏకలవ్యుండు గురునక ♦ నేకవిధులఁ
బ్రణతులొనరించి పూజించి ♦ భక్తి మించి
హేగురూత్తమ! తావకా ♦ హీనకరుణ
వెలయుశిష్యుని నన్ను భా ♦ వింపుమయ్య!

క. ఏనును నాకుఁ బ్రియంబగు
నీనిఖిలాస్త్రములు ధనము ♦ లీవనసీమల్
మానితవర్తన! నీకున
దీనము, భవదిష్టమెద్ది? ♦ తెలుపుమనంగన్.

క. దక్షిణకరశోభితమై
యక్షయశక్తిం దనర్చు ♦ నాబొటవ్రేలిన్
దక్షిణగా నిమ్మన్న వాఁ
డాక్షణమ యొసంగె దాని ♦ నంచితభక్తిన్.

గీ. దివ్యభక్తిని దేని సాధింపఁగలిగె
నట్టిశక్తికి నాధార ♦ మగుచు నలరు
దక్షిణాంగుష్ఠమే గురు ♦ దక్షిణముగ
నేకలవ్యుండుగా కొరు ♦ లియఁగలరె?

గీ. వసుధ నేకవీరుండని ♦ వన్నెకెక్కె
నెవ్వఁడా పార్థుఁడాతని ♦ యిష్టగురుఁడుఁ
దన్ను నర్థింపఁ గలమహా ♦ త్వంబుగన్న
యేకలవ్యుని గురుభక్తి ♦ యెంచఁదరమె?

క. గురుభక్తి కళారత్నా
కరతరణము శిష్యజీవి ♦ కావరణంబున్
గురుభక్తి గలుగువారల
కరుదే సకలార్థసిద్ధి ♦ యగుట ధరిత్రిన్.

---

# మక్షికము.

---

క. నీవెప్పుడేదో పనికే
పోవుదు విపుడేమొ దాహ ♦ ముంగొని నాతోఁ
ద్రావఁగ వేడుకపడుచు
న్నావో? మక్షికము! రమ్మ ♦ నాచెంగటికిన్.

క. త్రాగుము నాతో; నేనెటు
త్రాగిన నటు త్రాగుమీ! స్వ ♦ తంత్రితతోడన్
నాగిన్నెదరికి రమ్మీ!
యీగవ్యము చప్పరింపు ♦ మీ! మెలమెల్లన్.

క. నీమనసు వచ్చినట్లుగ
నీమనుగడ సార్థకముగ ♦ నెఱపఁగ వలదే!
యేమున్నది జీవితపరి
ణామము క్షణకాలికము క్ష ♦ ణక్షీణమె కా!

క. అరయఁగ నీ జీవితమును
మఱి నాజీవితము నొక్క ♦ మాదిరిగానే
పరుగిడుచు నున్నయవి స
త్వరముగఁ దమయంత్యదశలఁ ♦ బడయుటకొఱకున్.

---

# భాగ్యము.

---

ఎట్టులుండునో నాభాగ్య ♦ మెల్లియను మఁ
గాంచనేర్చుట నాపని ♦ కాదుకాదు
నేనునను దాఁటిపో లేదు ♦ నేఁడటంచు
నవగతంబగుచుండె నా ♦ కదియెచాలు.
మృత్యులోకవేళ నద్దమ ♦ రేయినాఁడు
నెత్తురుహరించి శ్వాసల ♦ నిలుపనిమ్ము
నేనునాలోని మేలిని ♦ ధానమునకు
నేకరణినైన నఁగర్తను ♦ గాకపోను.
కనఁబడకపోవు భాగ్యమా! ♦ కరఁగిపోవు
కనకమా! యూరకేపోవు ♦ ఘనసౌఖ్యపదము!
మెఱపిపోయెడు రత్నమా ♦ మీకునెల్ల
ఱెక్కలున్నవటంచు నె ♦ ఱింగియుంటి.
నెగిరిపోయెడు పక్షంబు ♦ లెఱుఁగఁబడియె
నట్టె ఱెక్కార్చుచును మాయ ♦ మాదురిట్టె
నిట్టివస్తులఁ గాంచుచు ♦ నెప్పటికిని
గూడ నావనిభావించు ♦ వాఁడఁగాను.

ఈప్రపంచకమే వాని ♦ నిచ్చెఁగాన
వానినెల్లను దానెప్పు ♦ డైన ఁరియె
వెండికైకొననిమ్ము పో ♦ విడువనిమ్ము
కాని నా పెన్నిధిని జేర ♦ నైనఁగలదె?
నేనునాయాత్మఁ జూడఁగా ♦ నేర్చినపుడు
నన్నునేఁబూర్ణముగఁ గనుఁ ♦ గొన్నయప్పుడు
నేను నాలోన నానంద ♦ మూనునపుడు
నేనెనారాజ్యమై యుందు ♦ నిశ్చయముగ.

---

# యద్దృశ్యం తన్నశ్యం.

---

ముద్దులొలికించు చిగురులో ♦ మొగ్గవోలె
దాఁపులను జిమ్మెడు గులాబి ♦ ఘాఘుపగిది
పగటియందుఁ బ్రభాతసం ♦ పత్కరణి
నక్షులనుదన్ను నుదయూరు ♦ గొర్వ్యాఁటల్లు
పాటపాడుచు నెగిరెడు ♦ పక్షిమాదిరి
నల్లనల్లన నీఁదురా ♦ యంచకైతిఁ
దానములఁబాడు వల్లకీ ♦ తంత్రిలీల
విశ్వమంతట నలమిన ♦ వెలుఁగుపోల్కి
లలితపరిమళ మలయూని ♦ లంబలాగు
తొలుకరింబోఁచు శాద్వల ♦ తలమువలెను
కడఁగి క్రొత్తగ మొదలిడ్డ ♦ కథకయిపడి
మలయుమించులఁ దగుమేఘ ♦ మాలభాతిఁ
బుట్టి, కనువిచ్చి, పురిటింటఁ ♦ బొలుపుదెలిపి
చిన్ని నెమ్మని నిగ్గులఁ ♦ జెంగలించి
ప్రెక్కలల్లార్చి, ఊఁ, యని ♦ నిక్కినిక్కి,
తప్పటడుగులఁదాటి తా ♦ తాయటంచు

ముద్దుమాటలఁ బాటల ♦ మురువుసూపి
శరణమున రత్నదీపమై ♦ జన్మసంపుఁ
గాంచి, కులమెల్లఁదనలోనఁ ♦ గలుపుకొనుచు
జీవయాత్రకు నూతన ♦ సృష్టిఁగూర్చి
సంతతులతోడ మెఱయుచు ♦ సంతతంబు
మాఁగి లోకానుభవము తి ♦ న్మ్రంచుకొనఁగ
జగతి నలరారుచుండును ♦ జనుఁడుఁగూడఁ;—
గాని, యోచింపఁ బ్రకృతిం ♦ కలనమునను
ఛాత్రోలంబునఁ దోఁచునై ♦ జంబుగలుగు
సకలమైన చరాచర ♦ సంతతికిని
భవము నాశంబుఁగూడఁద ♦ ప్పనివె సుమ్ము!
మొగ్గవిడిపోవును, గులాబి ♦ పుష్పవాఁడుఁ;
గాంచుచుండఁగనె ప్రభాత ♦ కాలవేగు;
నరుణబింబంబు పడమట ♦ నస్తమించు;
మఱియువిహగంబు గిరగిరఁ ♦ దిరిగిపడును;
ఈదురాయంచ మృతిదరి ♦ కేగియాఁగు;
స్వరములొలయించు తంతువు ♦ సాగితునియుఁ;
వెలుఁ గగిరిపోవుఁ; బరిమళా ♦ నిలమునడఁగు
నెండచే లేఁతపచ్చిక ♦ యెండిపోవుఁ;
గ్రమముగాఁ దుదముట్టును ♦ కథయుఁగూడ;

మాయమగు నంతలో మేఘ ♦ మాలికయును;
కూరుచుండెడు మనుజుండుఁ ♦ గూడఁ జచ్చు.
చావుపుట్టువు లవధులు ♦ జీవితమున
కట్టిజీవిత మొకస్వప్న ♦ మట్టిదగును;
జనన మారసిచూడని ♦ చ్చటికి మొదలు,
చావుఁ దలపోసి తెలియని ♦ చ్చటికి మొదలు,
భూతపంచకమనియెడు ♦ పోగు లెల్లఁ
దడవిపురిపెట్టి కూర్చిన ♦ త్రాడు వంటి
దగునుజీవంబు? క్రమముగా ♦ నట్టె నాగి
బిగిసి బిగ్గరగా నాగి ♦ తెగునుతుదకు.
కానదృష్టంబు నష్టమన్ ♦ గణనఁ జేసి
కొనియదృష్టంబునే దైవ ♦ మనిరి బుధులు.



# ముద్దరాలు.

---

"తెల్లనగు పత్త్రిములమీఁద • నల్లగల్వ
లెవరు చల్లినారే?" యని • యెంతో వింత
ముద్దరా లనుచున్నది • ముచ్చటపడి
కలము బావ యటంచురా • గరితలార!
ముగుద మొగమింత చేసికో • నగద కేల?
బావ యే చెర్వులో దిగఁ • బడెనో గాని
మంచిపూవులఁ గోయఁడు • కొంచెమైనఁ
గొప్పలోఁ బెట్టుకోరాని • కోమలములె?

---

# ముద్దరాలు.

---

మానసుబడి పెంచుకొనుచున్న ♦ మల్లెతీఁగ
మొగ్గఁ దొడిగిన దని మది ♦ ముదము గదురఁ
గులుకునడకల మట్టియల్ ♦ గులుకరింపఁ
బసిఁడిచిఱుగజ్జియలు తన్నుఁ ♦ బలుకరింప
అలరుమొగమునఁ జెమ్మట ♦ చిలుకరింప
సొగసుచూపుల దిక్కులు ♦ చూచుకొనుచు
నుపవనంబునఁబడి ముద్దు ♦ లొలుకుచుండఁ
బూఁపజవరాలొకర్తుక ♦ పోవుచుండె.
"అలరు బ్రాయంపుజవరాండ్ర ♦ కందఱకును
వయసునను సామ్యమే కానఁ ♦ బడుచునున్నఁ
బ్రకృతియందు భేదంబె చూ ♦ పట్టుచుండు
నహహా! విధిసృష్టినైపుణీ ♦ మహిమ మేమొ!
అలరుదండలకై కొంద ♦ ఱాసపడుదు
రాటపాటలకై కొంద ఱనుగమింతు
రలతిచెలినవ్వులకె కొంద ♦ ఱలరుచుందు
రలకరించుట కొకకొంద ♦ ఱనుమతింత్రు.
ఒకతె యుపవనభవనమం ♦ దుండఁ గోరు

నొకతె నెలరాలతిన్నియ ♦ నుండఁ గోరు
నొకతె పూవుటీరంబుల ♦ నుండఁ గోరు
నొకతె నిలువుటద్దముచెంత ♦ నుండఁ గోరు.
వలపుసకుమించుసిగ్గున ♦ సలరువారు
సిగ్గునకుమించువలపుచేఁ ♦ జెలఁగువారు
వలపొ? సిగ్గో? యెఱుంగక ♦ వరలువారు
నగిపడుచునుందు రిల ముద్ద ♦ రాండ్రలోన."
ఆయతివ పోవుచుండఁ "గో ♦ కో" యటంచుఁ
గోకిలము మావిచివురు మె ♦ క్కుచును గూసె
నపుడెకలకంఠి ప్రియుఁ జేర ♦ నరుగుదెంచెఁ
గాంతకన్నులఁబడె నాపి ♦ కద్వయంబు.
"పట్టపగలె నాథుఁడు తమ్ము ♦ నెట్టఁ బిలువ
నారగింపంగ వచ్చెఁబొ ♦ కాంగి నయును;
ఔర! మగ లెంత సాహసు ♦ లైనఁగాని
మగువ తనసిగ్గు విడనాడఁ ♦ దగునె యిట్లు?
ఎవరో చూచెద రనెడిసి ♦ గ్గెంతసిగ్గు?
ప్రాణవిభుఁ డెంతచనవరి ♦ యైనఁగాని
యప్పు డెంతటియొంటిపా ♦ టైనఁగాని
చెలుతనసిగ్గు తనుదాన ♦ చెరిపికొనునె?
ప్రియునిఁ గన్నత్తి కేళికా ♦ గృహమునందు

నైనఁ, దమిమించుమాపుల ♦ నైనఁ, బైఁట
చెఱఁ గొకించుక మాటుగాఁ ♦ జేసినైనఁ
దరిపఁ గనంజాల నిల్వుట ♦ ద్రమానఁదక్క
నేనొకర్తుక నున్నప్డు ♦ నేఁడు ప్రియుని
చనవునం జేరి యలరింతు ♦ ననిశలంతుఁ
గాని ప్రాణేశ్వరుండు నా ♦ కంటఁ బడినఁ
గ్రిచ్చకొనునెటనుండియోవచ్చి ♦ సిగ్గు."
అనుచుఁ దలయెత్తిచూడక ♦ యలుకపొదల
మాటునం బడి తనపూఁప ♦ మల్లెతీఁగ
కుదురుకొనియున్న సురపొన్న ♦ గున్నకడకు
నాలతాంతన్వ యల్లన ♦ నరుగుచుండ,
వెనుకఁ దూగాడుచుండిన ♦ వెలఁది పైఁట
తలిరుగొమ్మ నొకించుక ♦ తగులుకొనఁగఁ
గాంతుఁ డవుడప్డు పట్టుట ♦ కలదుగాన
సిగ్గునఁ దిరిగిచూడదు ♦ చెలువుఁ డనుచు.
చెలువకును కంపమునఁ జిరు ♦ చెమట వొడమ
కమ్మతెమ్మెర లొలసెను ♦ గమ్మతించు
మలయపవమానహతికిఁ గొ ♦ మ్మయును దూలె
తరుణిపైఁటయుఁ దూలెఁ గే ♦ తనమువోల.
అతిప*కవ్వాడు మరలఁ "గో*" ♦ యని వినఁబడి

యనుఁగు చెలికత్తెనాదంబు ♦ ననకరించెఁ
దరుణి చెలి వచ్చె నని వెను ♦ దిరిగి చూచె
వెనుక నెవ్వరు లేకుంట ♦ విశద మయ్యె.
కోమలాంగికి నెమ్మది ♦ కుదుటఁ బడియె
మరలఁ "గోకో" యనుచు విన ♦ బడియె నంత
వనజదళలోచన యనుమ ♦ దుసకుఁ దిరిగి
మల్లెపందిరికడ సఖి ♦ మణినిగాంచి
అలరుఁబ్రాయంపుమల్లిక ♦ నాత్మసఖియుఁ
దాను దర్శించి మిగుల సం ♦ తసము నొంద
నేఁచి పరుగున వచ్చుచు ♦ నింతలోనె
కొమ్మ భవనమ్మునకు గిరు ♦ క్కునను మరలె.
"వలదు వలదాఁగు మాఁగుమో ♦ చెలువ!" యనుచుఁ
"ఖుడఁతి నాతోడ నసు మ్మాన ♦ యిడితి" ననుచు
నెంతగా బ్రతిమాలిన ♦ నింతి వినక
పట్టుకుచ్చులజడ వెన్క ♦ పాముతోడ
పంతమాడంగ మొలనూలు ♦ వదలి జఘన
సీమ కేగంగ పయ్యెద ♦ చెఱఁగు మరుని
ప్రబలకేతనమనఁ దూలి ♦ పడఁగ నొక్క
పరుగులోన లతాంగి ద్వ ♦ క్స్థమును దాఁటె.
కారణము లేకపోవ దా ♦ కాంతకో ఱుకు

బాళినాయకుఁ డాఘాల ♦ పందిరికడ
నడఁగియుండియుఁ దమకించి ♦ యంతలోనె
ఝొక్కపఱిఁ దొంగి చూచెని ♦ లోపలికి.
మొదలె సిగ్గరికత్తియ ♦ ముద్దరాలు
వలపుపూఁదోఁటలోపలఁ ♦ బట్టపగలు
చెలఁ గనుంగొనుచుండంగఁ ♦ జెంపునెదుట
నిలుచునే సిగ్గు తక్కువే ♦ వలపుకంటె?
చెలువ మది నిండి పెరిసెన ♦ సిగ్గుకంటె
దయితునకును పదింతలు ♦ తమకమున్న
నెట్టులగు? నింత యోపిక ♦ పట్టవలయు
సిగ్గుపోవునుపాయంబు ♦ సేయవలయు.
చతురమతులార! జగతి ల ♦ జ్జాన్వితులకుఁ
బాళిపెంపునొంటిపాటె ప్రి ♦ యంబటంచు
నెఱిఁగి రెండవకంటివా ♦ రెఱుఁగకుండఁ
నిలువుఁడు మనోభవంబుల ♦ నెంచికొనుఁడు.



# అరణా గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | గర్దభస్తోత్రము. | 0 | 0 | 6 |
| 2. | కాలము. | 0 | 0 | 6 |
| 3. | గర్వము. | 0 | 0 | 6 |
| 4. | ఒకస్వప్నము. | 0 | 0 | 6 |
| 5. | అనుమానపురుషులు. | 0 | 0 | 6 |
| 6. | రాజారపిపర్మిట్. | 0 | 0 | 6 |
| 7. | నాటకములు. | 0 | 0 | 6 |
| 8. | నూతనవస్త్రాది. | 0 | 0 | 6 |
| 9. | గురుశిష్యులు. | 0 | 0 | 6 |
| 10. | తండ్రి, కొడుకు. | 0 | 0 | 6 |
| 11. | ఒకచిత్రము. | 0 | 0 | 6 |
| 12. | బాలసుందరి. | 0 | 0 | 6 |
| 13. | వీరబాలుడు. | 0 | 0 | 6 |
| 14. | భారతోద్ధారము. | 0 | 0 | 6 |
| 15. | బ్యారిష్టరు. | 0 | 0 | 6 |
| 16. | ఆలుమగలు. | 0 | 0 | 6 |

అరణాగ్రంథములు 0—4—0ల తక్కువ వెలకోరిన చో పంపబడవు. పోస్టేజీ కొనువారే భరించవలెను.

ఇప్పుడుఆర్డరుయిచ్చినవారికిఏప్రిల్ నెలాఖరునకుపంపబడును.

వలయువారు,

బి. వి. రావు అండ్ బ్రదర్సు

నిడదవోలు, కృష్ణాజిల్లా.

అవివాహితులవలయును.

# ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము.

నిడదవోలు, కృష్ణాజిల్లా.

ఇందు రెండుమాసములకొక నవల చొప్పున వెలువడుచుండును డెమ్మీసైజున నూఱుపేజీలకారణాలచొప్పున పోస్టేజి మేమే భరించి చందాదారులకును, పోస్టేజిగాక ఇతరులకు 0—8—0 చొప్పున నిచ్చెద. ఎన్నివందలపేజీలనవలలైన ఒకరూపాయికి మించియుండదు. ప్రవేశరుసుముగా 0-2-0యీయవలయును. అన్నియు క్యాలికోబయిండుగల చక్కని నవలలు.

| నవలలు. | చందాదారులకు. | ఇతరులకు. |
|---|---|---|
| | రు. అ. | రు. అ. |
| * 1. దుర్గేశనందని. | 0—12 | 1—0 |
| * 2 వసుమతీవసంతము. | 1—0 | 1—8 |
| 3. లలితచంద్రహాసము. | 0—10 | 0—14 |
| * 4. మృణ్మయి. | 1—0 | 1—5 |
| * 5. సీతారామ. | 1—0 | 1—8 |
| * 6. నూర్జహాను. | 1—0 | 1—8 |
| 7. రాజసింహ. | 1—0 | 1—8 |
| 8. మాధవీలత. | 1—0 | 1—5 |
| 9. మృణాలిని. | 1—0 | 1—5 |
| 11. మనోరమ. | 1—0 | 1—5 |
| 11. దురదృష్టవంతులు. | 1—0 | 1—8 |
| 12. విషవృక్షము. | 1—0 | 1—5 |
| 13. ప్రమదావనము. | 1—0 | 1—8 |
| 14. వంగవిజేత. | 1—0 | 1—5 |
| 15. నౌకాభంగము. | 1—0 | 1—8 |

* ఈగ్రంథములు తెనుఁగు హైస్కూళ్లలోని 4, 5, 6, ఫారములకుపఠనగ్రంథములు(Text Books)గా టెక్స్టుబుక్కుకమిటీవారిచే నామోదింపఁబడినవి.

**N. B.** వసుమతీవసంతము 1916 సంవత్సరము పరీక్షకు ఇంటరుమీడియేటుక్లాసునకు టెక్స్టుబుక్కుగా యూనివర్సిటీవారిచే నిర్ణయింపఁబడినది.

# అనుబంధములు

| | చందాదారులకు. | ఇతరులకు. |
|---|---|---|
| | అ. పై. | అ. పై. |
| రాధారాణి | 4—0 | 4—0 |
| యుగళాంగుళీయకము. | 3—0 | 3—0 |
| రాజభక్తి. | 2—0 | 3—0 |
| లీల. | 3—0 | 4—0 |
| 5. సాధన. | 5—0 | 7—0 |
| 6. ఇందిర. | 3—0 | 4—0 |
| 7. హారావళి. | 3—0 | 4—0 |
| 8. ప్రభావతి. | 2—0 | 3—0 |
| 9. మాలతి. | 1—6 | 2—0 |
| 10. కమలాకాంతుఁడు. | 1—6 | 2—0 |
| 11. పరిమళ. | 6—0 | 8—0 |
| 12 రజని. | 6—0 | 8—0 |
| 13 నీరద. | 5—0 | 7—0 |
| 14. సీతావనవాసము. | 5—0 | 7—0 |
| 15. ఉన్మాదిని. | 3—0 | 4—0 |
| 16. సంతాపకుఁడు. | 4—0 | 5—0 |
| 17. వియోగిని. | 3—0 | 4—0 |
| 18. చంద్రసేనుఁడు. | 4—0 | 5—0 |
| 19. కృష్ణకాంతునిమరణశాసనము. | 6—0 | 8—0 |
| 20. ఆరణ్యక. | 6—0 | 8—0 |
| 21. వ్యాఘ్రాచార్యబృహల్లాంగూలము. | 2—0 | 2—6 |
| 22. ఉన్మత్త. | 2—0 | 2—6 |
| 23. మీరాబాయి. | 1—0 | 1—0 |
| 24 రాణీతారాబాయి.. | 1—0 | 1—0 |
| 25. కాబూలుసాహేబు | 1—0 | 1—0 |
| 26. భారతమహిళ. | 5—0 | 7—0 |
| 27. భారతీయులయుపనివేశములు. | 2—0 | 2—6 |